


చక్ర గోల్డ్ టీ నుండి
ఎంచక్కటి
టైమ్ టేబుల్

లక్కీ
కాంటెస్టులో
గెలుపు

# అమ్మకు బంగారు రుచులు, నీకు బంగారు టైమ్ టేబుల్.




అమ్మ చక్ర గోల్డ్ టీ కొంటే నువ్వు చక్ర గోల్డ్ నుండి ఎంచక్కటి స్కూల్ టైమ్ టేబుల్‌ని అందుకోవచ్చు. ఇంతే కాదోయ్. నీ గురించి ఈ కూపన్‌లో కొన్ని వివరాలు నింపు చాలు. అదృష్టముంటే రూ.1000 చక్ర గోల్డ్ స్కాలర్ షిప్పును గెలుచుకోవచ్చు. మీ అమ్మ కోసం అమ్మకిష్టమైన 1 కెజీ చక్ర గోల్డ్ టీ ప్యాకును కూడా గెలుచుకోవచ్చు.

టాటావారి
**చక్ర గోల్డ్ టీ**

McCANN/BLR/TTLC/61/2000

# చందమామ

సంపుటి 102 జూన్ 2000 సంచిక 6



## ఈ సంచికలో...

### కథలు



### ఈ నెల విశేషాలు



రెక్కలగుర్రం (బేతాళ కథ)



భద్రుడి చిరాకు



స్వర్ణ సింహాసనం



భారత సంస్కృతి చరిత్ర

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

## మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారిభాషల్లో

వారితో మాట్లాడే

చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకు చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు

పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా

పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION

CHANDAMAMA INDIA LIMITED

CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026


సంపాదకుడు

విశ్వం



ఉత్తర ప్రత్యుత్తరాలకు:

చందమామ మేగజైన్ డివిజన్

చందమామ బిల్డింగ్స్

వడపళని, చెన్నయ్- 600 026

ఫోన్/ఫ్యాక్స్: 4841778

4842087

ఇ. మెయిల్: Chandamama@ vsn lcom

ముంబాయి కార్యాలయం

2/B, నాజ్ బిల్డింగ్స్

లామింగ్‌టన్ రోడ్,

ముంబాయి-400 004

ఫోన్ : 022-388 7480

ఫ్యాక్స్: 022-388 9670



అమెరికాలో

విడిగాపీ $2

సంవత్సర చందా $20

సొమ్ము పంపవలసిన చిరునామా:

ఇండియా అబ్రాడ్

43 వెస్ట్ 24 స్ట్రీట్

న్యూయార్క్, ఎన్.వై 10010

ఫోన్: (212) 929-1727

ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు:
చక్రపాణి. బి.నాగిరెడ్డి

# వేసవిసెలవులలో

సంవత్సరమంతా ఆటవిడుపు అయినట్టయితే, ఆటలు కూడా విసుగు పుట్టిస్తాయి. అంటే, పనులు చేయవలసిన సమయంలో కష్టపడి పనిచేసే వాళ్ళే సెలవులను హాయిగా, ఆనందంగా గడపగలరన్నమాట!

ప్రస్తుతం మన పాఠకులు చాలామందికి వేసవి సెలవులు సగం అయిపోయి వుంటాయి. విరామ సమయాన్ని ఎలా వినియోగించుకుంటాం అన్నది మన జీవన స్వభావాన్ని సూచిస్తుంది. మనల్ని ఒక పనిని చేయమన్నప్పుడు, ఇష్టం ఉన్నా, లేక పోయినా ఆ పనిని చేసి తీరాలి. మన పనులను మనం ఎంపిక చేసుకునే స్వతంత్రం ఉన్నప్పుడు ఇష్టమైన పనులనే చేపడతాం.

సెలవులు అలాంటి స్వాతంత్ర్యాన్ని మనకు కల్పిస్తాయి. ఇంతకు ముందు మనం చేయాలనుకుని, సమయం లేనందున చేయలేక పోయిన పనులను ఇప్పుడు చేసు కోవచ్చు. మరి కొందరయితే ఎన్నో పనులు చేయాలనుకుని ఎన్నెన్నో పథకాలు, కార్యక్రమాలు పెట్టుకుంటారు. త్వరగా ఒక నిర్ణయానికి రాలేక, చివరికి వాటిని ప్రారంభించే సరికే సెలవులు కాస్త అయిపోవడం తెలియవస్తుంది!

అయినా, మనసుండాలేగాని, మిగిలి ఉన్న సెలవులను కూడా సక్రమంగా వినియోగించు కోవడానికి ఎన్నో మార్గాలున్నాయి. మంచి పుస్తకాలు, ముఖ్యంగా మన దేశ చరిత్ర, సంస్కృతికి సంబంధించిన పుస్తకాలను చదవవచ్చు. పరిసరాల పరిశుభ్రతకూ, పర్యావరణ రక్షణకూ రోజూ, ఒకటి రెండు గంటలు వినియో గించవచ్చు. అనువైన ప్రదేశాలలో మొక్కలు నాటవచ్చు. ఈ విషయంలో మనకు సాయపడే సంస్థలు కూడా ఉన్నాయి.

చదువు మానసిక వికాసానికి దోహదం చేసినట్టే, మొక్కలు నాటడం పర్యావరణ పరిరక్షణకు సహాయపడుతుంది!

# చందమామ కబుర్లు

## షేక్స్‌పియర్ ఇటలీ దేశస్థుడా?



సుప్రసిద్ధ నాటక కర్త విలియం షేక్స్ పియర్ ఇటలీ దేశానికిచెందిన వాడనీ, ఆయన అసలు పేరు మైకేలేంజిలో అనీ సిసిలీకి చెందిన ప్రొఫెసర్ మార్టినోలు వారా (71) చెబుతున్నాడు. షేక్స్‌పియర్ తన 24 వ యేట లండన్‌కు వలస వెళ్ళి స్థిరపడ్డాడట. ఇటలీ దేశస్థుడు కావడం వల్లే, ఆయన రచించిన మొత్తం 37 నాటకాలలో 15 నాటకాలకు ఇటలీదేశ నేపథ్యంతోనే కథాంశాలు ఉన్నాయి - అని తన వాదానికి ఆధారాలు చూపు తున్నాడీ ప్రొఫెసర్!

## నశిస్తూన్న పులులు!

దొంగతనంగా పులులను వేటాడడం ఆపక పోతే, మరొక పది సంవత్సరాలలో భూమిపైనుంచి పులులు నశించి పోతాయని- బ్రిటన్ పర్యావరణ శాఖ మంత్రి అభిప్రాయపడుతున్నారు. పులుల అవయవాల నుంచి తయారు చేసే ఔషధాలకు చైనా లోవంచి గిరాకీ వుంది. అందుకు వాళ్ళు మన దేశంలోని వేటగాళ్ళ మీదే



ఆధార పడు తున్నారు. మన వాళ్ళకు కూడా వులిచర్మం మీద మహామక్కువ. అందువల్ల పులులను రక్షించుకునే అవకాశం అంతంత మాత్రంగానే కనిపిస్తున్నది!

## ఐన్‌స్టీన్‌కు సవాలు!

సుప్రసిద్ధ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ నిర్ధారించి చాటినట్టు వెలుగు వేగం స్థిరమైనది కాదు-- అని నిరూపించడానికి పోర్చుగీసు శాస్త్రవేత్త డా॥ జోవో మాంగీజో ప్రయత్నిస్తు న్నాడు. వెలుగు వేగంలో తేడా వుంటుం దం టూన్న ఆయన పరిశోధనా సిద్ధాంతాన్ని శాస్త్రవేత్తలు అంగీకరించి నట్టయితే 20వ శతాబ్దంలో కనుగొనబడిన మరువరాని సిద్ధాంతాలలో ఒకటిగా ప్రసిద్ధిగాంచిన ఐన్‌స్టీన్ సిద్ధాంతాన్ని మార్చవలసి వస్తుంది!



## సప్తగ్రహ కూటమి!

గత మే నెల మొదటివారంలో అంతరిక్షంలో చాలా అరుదైన ఒక అద్భుత సంఘటన జరిగింది. మన సూర్య మండలంలో ప్రధాన గ్రహాలైన



సూర్య, చంద్ర, బుధ, శుక్ర, గురు, శని, అంగారక గ్రహాలు ఒకేసారి వృషభ రాశిలో చేరాయి. గతంలో దాదాపు 15 శతాబ్దాలకు పూర్వం అంటే 529వ సం॥ ఇలా జరిగింది. ఈ సంవత్సరంలో జరిగిన ఈ సప్తగ్రహకూటమి భూమండలానికి శుభ ప్రద మని చెబుతున్నారు!

## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు:

భారత స్వాతంత్ర్య ఉద్యమానికి స్ఫూర్తినీ, ఉత్తేజాన్నీ కలిగించిన అద్భుతగీతం "వందే మాతరం!" ఈ శతాబ్దారంభంలో ఆ గీతం భారత ప్రజలను ఉర్రూతలూగించింది!

వేలాదిమందిదేశభక్తులు "వందేమాతరం!" అని గళమెత్తి గర్జిస్తూ, బ్రిటిష్ పాలకుల అణచివేతను ఎదుర్కొన్నారు. ఆ గీతాన్ని ఆలపిస్తూ సంతోషంగా జైళ్ళకు వెళ్ళారు.

దేశ ప్రజలను జాగృతం చేసిన ఆ జాతీయం గీతాన్ని బంకించంద్ర చటోపాధ్యాయ రచించాడు.

'ఆనందమఠం' అనే నవలలో ఆ గీతం వస్తుంది. ఈస్ట్ ఇండియా కంపెనీపై ధ్వజమెత్తి తిరుగుబాటు జరిపిన ఒక అసాధారణ సంఘటన ఆ నవలా రచనకు ప్రేరణ కలిగించింది. ఆ తిరుగుబాటు జరిపిన వారు మామూలు ప్రజలు కారు. సన్యాసులు; కాళీమాత భక్తులు. అంటే-- బ్రిటిష్ పాలనను ఎదిరించే వాళ్ళు సన్యాసుల్లా స్వార్థ రహితులుగానూ, భారత మాత భక్తులుగానూ ఉండాలని బంకిం చంద్ర చటోపాధ్యాయ ఆశించాడు. వందేమాతరం గీతం మాతృభూమిని ఉద్వేగ భరితంగా కీర్తిస్తుంది.

బంకిం చంద్ర 1838వ సం॥జూన్ 28వ తేదీ బెంగాల్‌లో జన్మించాడు. కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ప్రప్రథమంగా పట్టభద్రులైన ఇద్దరిలో ఒకడాయన.

బంకిం చంద్ర చటోపాధ్యాయ



ఆయన మేజిస్ట్రేట్‌గా సమర్థ వంతంగా పనిచేశాడు గాని, దేశభక్తుడుగానే సుప్రసిద్ధుడు.

ఆధునిక వంగ సాహిత్యాభివృద్ధికి ముఖ్యంగా వచన రచనా వికాసానికి బంకిం చంద్ర ఎంతో కృషి చేశాడు. భాషకు ఆయన నూతనోత్తేజాన్ని కలి గించాడు. ఆయన ఉత్తమ శ్రేణికి చెందిన నవలా రచయిత, కవి, పత్రికా రచయిత, వ్యాస రచయిత. ఆయన ఆంగ్ల భాషలో కూడా రచనలు చేశాడు. ఆయన రచించిన "రాజ్ మోహన్స్ వైఫ్" అనే ఆంగ్ల నవలను- భారతీయుడు రచించిన తొలి ఇంగ్లీషు నవలగా కొందరు భారతీయ ఆంగ్ల సాహిత్య చరిత్రకారులు పేర్కొం టారు.

భారత 'జాతీయప్రవక్త' శ్రీ అరవిందులు బంకిం చంద్రను 'ఋషి'గా అభివర్ణించాడు. ఆనాటినుంచి ఆయన భారతీయుల స్మృతి పథంలో ఋషి బంకిం చంద్రగా మిగిలి పోయాడు.

బంకిం చంద్ర చటోపాధ్యాయ 1894 వ సం॥లో అమరుడయ్యాడు.

ఈ సంచిక నుంచి పోటీలో వచ్చిన మార్పును గమనించండి!

కథకు సరైన ముగింపు రాయండి. చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

ఒక చిన్నకథ తొలిభాగం దిగువనివ్వబడింది. ఆసక్తి కరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి.

ఇక కథను చూద్దాం:

గంగాపురం రాజోద్యానం చాలా మనోహరమైనది. ఉద్యానవనంలో ఫలవృక్షాలూ, పూలమొక్కలూ చాలా ఉండేవి. తోటమాలి ప్రతిమొక్కనూ, చెట్టునూ, కన్నబిడ్డలా భావించి పెంచుతూ వచ్చాడు.

ఆ వనంలో కోతులు కొన్ని ఉండేవి. అవి మామూలు కోతులు కావు. వాటికి పువ్వులంటే మహా ఇష్టం. తోటమాలి ఆ మొక్కలను శ్రద్ధగా కాపాడ్డం అవి వింతగా చూసేవి. పూలను కోసేవికావు; మొగ్గలను ముట్టుకునేవి కావు. అందువల్ల తోటమాలి వాటితో స్నేహంగా ఉండేవాడు. సంజ్ఞలతో కోతులకు అప్పుడప్పుడు మొక్కలకు నీళ్ళు పోయడం నేర్పేవాడు.

ఒకనాడు తోటమాలి ఏదో పనిమీద పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. వాడు లేకుంటే పూల మొక్కలకు నీళ్ళు పోసేవాళ్ళెవరు? బాగా ఆలోచించి వాడొక నిర్ణయానికి వచ్చాడు. కోతులను పిలిచి పరిస్థితిని సంజ్ఞలతో వివరించాడు. నీళ్ళు పోసే బాధ్యతను వాటికి అప్పగించాడు. అవి ఒప్పుకున్నాయి. నీళ్ళు పోసే పాత్రలూ, పరికరాలూ, నీళ్ళున్న చోటూ చూసుకున్నాయి.

మరునాడు కోతులన్నీ కలిసి మొక్కలకు నీళ్ళు పోయడం ప్రారంభించాయి. కోతులపెద్ద వాటిని దూరం నుంచి పర్యవేక్షించ సాగింది. హఠాత్తుగా దానికొక అనుమానం కలిగింది. మొక్కలకు చాలినంత నీళ్ళు అందాయా, లేదా? కొన్ని మొక్కలకు నీళ్ళు మరీ ఎక్కువై పోలేదు కదా?

ఈ పరిస్థితిని అది ఎలా ఎదుర్కొన్నది? ఈ సమస్యను ఎలా పరిష్కరించింది? ఇక రండి. కలం, కాగితం అందుకోండి! మీరు రాసి పంపే రచన జూన్ 30వ తేదీలోగా మాకు చేరాలి. గెలుపొందే రచనను ఆగస్ట్ నెల సంచికలో ప్రచురిస్తాం.

-సంపాదకుడు

## మే 2000 భారతదర్శనం క్విజ్ సమాధానాలు

1. ధర్మరాజు. అరణ్యవాస సమయంలో కొంగ రూపంలో వచ్చిన యమధర్మరాజు అడిగిన ప్రశ్నకు సమాధానంగా.
2. ఎ. శకుని గాంధార దేశ యువరాజు.
   బి. కేసరి నివసించిన ప్రాంతం మహామేరు.
   సి. ధర్మరాజు రాజసూయయాగం చేయడానికి ముందు సహదేవుడుమాహిష్మతి రాజును ఓడించాడు.
   డి. భరతుడి తల్లి కైకేయి కేకయరాజు కుమార్తె.
   ఇ. వాల్మీకి ఆశ్రమం తమసానదీ తీరంలో ఉండేది.



బేతాళ కథలు

# రెక్కల గుర్రం

**ప**ట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధ రాత్రి వేళ, భయంకరమైన ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ అంతా, నువ్వు సాధించదలచిన కార్యానికి అనుకూల మైనది కాదేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఏ కార్యాన్ని సాధించ దలచినా, తెలివిమంతుడు దానికి తగినపరికరాలను ఎంచు కుంటాడు. పులిని వేటాడ దలచిన వాడు విల్లంబులతో కాక, ఏ ఉండేలుబద్ద



తోనో బయలు దేరడం, అనవసర ప్రయాస అవుతుంది. అంటే, అనుకున్న లక్ష్యాన్ని సాధించ దలచిన వాడికి, అసలా లక్ష్యం సాధించవలసిన అవసరం వున్నదా అన్న విచక్షణా, వివేకాలు కావాలి.అవి లేనప్పుడు శాంతిపురరాజ్యం లోని ప్రతాపుడనేయువకుడి లాగా భంగ పాటుకు గురికావలసి వస్తుంది. వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

శాంతిపుర రాజు ఇంద్రసేనుడికి ఒక కుమారుడు, కుమార్తె వున్నారు. ఆ ఇద్దరిలో కుమార్తె దేవదత్త పెద్దది. యుక్త వయసుకు వచ్చిన దేవదత్తకు వివాహం చేయ సంకల్పించాడు ఇంద్రసేనుడు.తండ్రి అభిప్రాయం తెలిసిన దేవదత్త, ''నాన్నా! ఊహ తెలిసినప్పటి నుంచీ నా మనసులో ఒక కోర్కె వున్నది. ఆ కోరిక తీర్చిన వీరుడినే వివాహ మాడతాను,'' అన్నది.

"ఏమిటాకోరిక?'' అని అడిగాడు, ఇంద్రసేనుడు.

''వెన్నెలవేళ రెక్కలగుర్రం ఎక్కి, ఆకాశంలో విహరించాలన్నదే, నా కోరిక. అలాంటి రెక్కలగుర్రాన్ని తేగలిగిన వాడినే వివాహమాడతాను,'' అన్నది దేవదత్త.

కుమార్తె కోరిక విని, ఇంద్రసేనుడు అమితాశ్చర్యం చెందాడు. రెక్కల గుర్రాలను గురించి కథల్లో వినడం తప్పించి అవి ఎక్కడా భూమి మీద వున్న రుజువులు లేవు. ఎంత మహావీరుడైనా లేని రెక్కలగుర్రాన్ని ఎలా తేగలడు?

రాజు తనసంశయం చెప్పగానే, దేవదత్త, ''ఏవీరుడైనా రెక్కలగుర్రాన్ని తేగలిగితేనే నా వివాహం జరుగుతుంది. అలా కానప్పుడు, నేను అవివాహితగానే వుండిపోతాను!'' అన్నది.

కుమార్తె మొండి పట్టుదలా, పంతం ఎరిగిన ఇంద్రసేనుడు, ఇక చేసేది లేక, రెక్కల గుర్రాన్ని తెచ్చిన వాడితో తన కుమార్తె వివాహం జరిపిస్తానని చాటింపు వేయించాడు. ఆ చాటింపు విన్న ఇరుగు పొరుగు దేశాల రాజకుమారులు రెక్కలగుర్రం కోసం రక రకాల ప్రయత్నాలు చేశారు. అయితే, ఎవరికీ అది సాధ్యపడలేదు.

ఆ రాజ్యంలో ప్రతాపుడనే యువకుడున్నాడు. వాడు మంచి అందగాడు, ధైర్యశాలి. వాడు రెక్కలగుర్రాన్నిగురించిన చాటింపు విన్నాడు.అయితే రాజకుమార్తె

అందని చందమామ అని, ఆ చాటింపు గురించి పట్టించుకోలేదు. ఏడాది గడిచినా రెక్కలగుర్రాన్ని ఎవరూ తేలేక పోవడంతో, ఆ కార్యం తను సాధించాలన్న తలంపు కలిగింది వాడికి.

ఇరవై ఏళ్ళలోపు వాడైన ప్రతాపుడికి నా అన్న వాళ్ళెవరూలేరు. వాడు గ్రామంలో పూలమ్మే వృత్తితో కాలం గడుపుతున్నాడు. వాడు విష్ణాలయంలోని విగ్రహాలకు పూలతో అలంకరణలు చేయడంలో కడునేర్పరి. ఆలయ పూజారి గరుడాచారికి, వాడంటే ఎంతో వాత్సల్యం.

ఒకనాడు ప్రతాపుడు, పూజారికి, రాజు ఇంద్రసేనుడి చాటింపు గురించి చెప్పి, "స్వామీ! అసలీ రెక్కలగుర్రాలనేవి లోకంలో ఎక్కడైనా వుండేనా?" అంటూ తన అనుమానం వెల్లడించాడు.

దానికి పూజారి నవ్వి, "నాయనా! మనం వున్న లోకం తప్ప మరెక్కడా లోకాలు లేవనుకోకు. గంధర్వ, కిన్నెర, కింపురుష- ఇలా అనేక దేవగణ జాతులు నివసించే లోకాలున్నవని పురాణాలు చెబుతున్నవి. మన రాజ్యం వింధ్య పర్వతానికి అతి సమీపంలో వున్నదని, నీ వెరిగిందే గదా! ఆ పర్వత శిఖరాలమీదా, లోయల్లో అనేకానేక పురాతన దేవాలయాలున్నవని, సాహసించి అక్కడికి వెళ్ళివచ్చిన వాళ్ళు చెబుతారు. అక్కడి జలపాతాల్లో, సరస్సుల్లో స్నానమాడేందుకు, రాత్రివేళ ఆకాశం నుంచి దిగి వచ్చే గంధర్వ కన్యలను చూశామన్న వాళ్ళూ వున్నారు!" అన్నాడు.



పూజారి మాటలు విన్న ప్రతాపుడు, అప్పటికప్పుడే ఒక నిశ్చయానికి వచ్చి, "సెలవు స్వామీ!" అంటూ ఆయనకు నమస్కరించి, మర్నాటి వేకువ జామున వింధ్య పర్వతాల కేసి బయల్దేరాడు. వాడు, ఆనాటి సాయంకాలం వరకూ ఒక అరణ్య మార్గాన నడిచి, సూర్యాస్తమయానికి పర్వత ప్రాంతానికి చేరాడు.

అక్కడ వాడికొక పెద్ద జలపాతం, దాపుల్లో కొన్ని గుహలూ కనిపించాయి. జలపాతానికి ముందున్న ప్రదేశమంతా పెద్ద చెట్లతో, వాటి నీడల్లో రకరకాల పూల మొక్కలతో చాలా అందంగా వుంది. వాడు సువాసనలు వెదజల్లే పూలు కోసి, ఒక చెట్టుకు లతలు అల్లి ఊయల ఒకటి తయారు చేశాడు. ఆ ఊయలను పూలతో



మనోహరంగా అలంకరించాడు. ఆసరికి చీకటి పడసాగింది.

అది శుక్లపక్షం. వాతావరణం మనోహరంగా వున్నది. ప్రతాపుడు ఒక చెట్టు ఎక్కి కూర్చున్నాడు. అర్ధరాత్రి సమయాన కొందరు గంధర్వ కన్యలు, ఆకాశం నుంచి దిగివచ్చి జలపాతంలో స్నానాలు చేశారు. వాళ్ళల్లో చారుశీల అనే గంధర్వకన్య దృష్టి పూల ఊయల మీదపడింది. స్నానాలు ముగించి మిగతా వాళ్ళు ఆకాశంలోకి ఎగిరి పోగానే, చారుశీల ఊయలను సమీపించి, దానిలో కూర్చుని చాలాసేపు ఆనందంతో తన్మయురాలవుతూ ఊగింది

కొంతసేపటికి చారుశీల ఊయల దిగి గంధర్వ లోకానికి బయలుదేర బోతూండగా, ప్రతాపుడు చెట్టు దిగివచ్చి, "ఈ ఊయల తయారు చేయడానికి చాలా శ్రమ పడ్డాను. నువ్వు ఇందులో ఊగి చాలా ఆనందించినట్టు కనబడుతున్నది. నాకేం ప్రతిఫలం ఇవ్వకుండా వెళ్ళడం న్యాయం అనిపించుకోదు!" అన్నాడు.

ప్రతాపుణ్ణి చూసి చారుశీల ఒక్కక్షణం నివ్వెర పోయి, అతడు చెప్పింది విని, "ఏం కావాలో కోరుకో!" అన్నది.

"నాకు రెక్కలగుర్రం కావాలి. దాన్ని సంపాదించితే, రాకుమారి దేవదత్తతో, నా వివాహం జరుగుతుంది," అన్నాడు.

ప్రతాపుడి కోరిక విని, చారుశీల ఉలిక్కిపడి "నీ కోరిక తీర్చగల శక్తి నాకు లేదు," అన్నది.

"పోనీ, అది తీరే ఉపాయం చెప్పు చాలు!" అన్నాడు ప్రతాపుడు.

"మా గంధర్వలోకంలో రెక్కలగుర్రాలున్నవి. అక్కడికి నిన్ను తీసుకు పోగలను. ఆ తర్వాత నీ తెలివి తేటలతో కార్యం సాధించుకో," అంటూ చారుశీల, ప్రతాపుణ్ణి ఒక ముత్యాలహారంగా మార్చి మెడలో వేసుకుని, గంధర్వ లోకంలో రెక్కల గుర్రాలుండే ప్రాంతాన వాడికి తిరిగి మానవ రూపం ప్రసాదించి వెళ్ళిపోయింది.

ప్రతాపుడు అక్కడవున్న రెక్కల గుర్రాలలో ఒకదాన్ని, తనతో పాటు తెచ్చిన భూలోక పుష్పాలతో అద్భుతంగా అలంకరించాడు. అంతలో తెల్లవారింది. ఆ రోజు గంధర్వరాజు స్వర్ణగంభీరుడి పుట్టిన దినం వేడుకలు జరగనున్నవి. రాజు, ఆనాడు తను ఎన్నుకున్న రెక్కలగుర్రం మీదే, సంవత్సరమంతా తిరుగుతాడు. రాజుతో పాటు, ఆ

గుర్రాన్నీ గంధర్వులు భక్తి శ్రద్ధలతో పూజిస్తారు.

గంధర్వరాజు, తన వాహనాన్ని ఎన్నుకునేందుకు మంగళ వాయిద్యాలతో రెక్కల గుర్రా లుండే ప్రాంతానికి బయలుదేరాడు. ఆ శబ్దాలు విన్న రెక్కలగుర్రం ప్రతాపుడితో, "గంధర్వరాజు ఇటు కేసే రాబోతున్నాడు. నన్ను గొప్పగా అలంకరించావు. ఒకవేళ రాజు రాజ్య మంతా ఆకాశం నుంచి వీక్షించడానికి ఒక సంవత్సరం పాటు నన్నే తన వాహనంగా ఎన్నుకునే అదృష్టం పడితే, నువ్వు కోరిన సాయం చేయగలను. ప్రస్తుతానికి నువ్వెవరి కంటా బడకుండా, ఆ కనబడే పచ్చల భవనంలో దాక్కో. రాత్రికి వచ్చి నిన్ను కలుస్తాను," అన్నది.

ప్రతాపుడు సరేనని, పరుగు పరుగున పోయి పచ్చల భవనంలో దాక్కున్నాడు. అంతలో గంధర్వరాజు అక్కడికి వచ్చి, రెక్కల గుర్రాల్లో ప్రతాపుడు పూలతో అలంకరించిన దాన్ని చూసి, "ఓహో, అద్భుతాద్భుతం! ఈ అశ్వరాజాన్ని ఒక్క సంవత్సర మేమిటి? బ్రతికున్నన్నాళ్ళూ నా వాహనంగా చేసుకుంటాను!" అంటూ అమితోత్సాహంతో ఎగిరి రెక్కలగుర్రం మీద కూర్చున్నాడు.

మరుక్షణం మంగళవాయిద్యాలు శబ్దించాయి. అక్కడ చేరిన గంధర్వులు దిక్కులు పిక్కటిల్లేలా జయ జయ ధ్వానాలు పలుకుతూ చప్పట్లు చరిచారు.

ఆనాటి రాత్రి పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్న సమయంలో, రెక్కలగుర్రం ప్రతాపుడు దాగివున్న పచ్చల భవనం దగ్గరకు



వచ్చి, అతడు బయటికి రాగానే, "ఓ భూలోక వాసీ! నీ అలంకారం వల్ల నేను, గంధర్వ ప్రభువుల ప్రధాన వాహన మయ్యాను. చాలా కృతజ్ఞురాల్ని. ఇకనీ కోర్కె ఏమిటో చెప్పు," అని అడిగింది.

అప్పుడు ప్రతాపుడు, రాకుమారి దేవదత్త గురించి చెప్పాడు. అది విన్న రెక్కలగుర్రం ఒకసారి రెక్కలాడించి మైమరిపించే గంధర్వ గానంలా కొంతసేపు సకిలించి, "ఓయీ, మర్త్యుడా! నీ ఈ కోరిక అనుచితం. పూవులు కట్టి జీవనం సాగించే నువ్వు, రాకుమారిని వివాహమాడగోరడం ఉచితం కాదు. గంధర్వాశ్వాలకు భూలోక దర్శనం నిషిద్ధం. ఐనా, ఆడిన మాట తప్పడం, మా జాతి అశ్వాలకు ఇంకా బాగా అలవడని విద్య. పద, అధిరోహించు!" అన్నది.

ప్రతాపుడు ఏదో సంశయగ్రస్తుడిలా తలాడిస్తూ, రెక్కల గుర్రం మీద ఎక్కి కూర్చున్నాడు. గుర్రం వాయువేగంతో ఆకాశం నుంచి శాంతి పుర రాజభవనం కేసి దిగింది. వెన్నెల వేళ ఉద్యానవనంలో విహరిస్తున్న రాకుమారి దేవదత్త, గుర్రాన్ని చూస్తూనే శిలా ప్రతిమలా నిలబడిపోయింది.

ప్రతాపుడు, రెక్కలగుర్రం మీది నుంచి దిగి, "రాకుమారీ! మీ చిరకాల వాంఛ తీరింది. ఈ రెక్కలగుర్రాన్నెక్కి మీకిష్ట మైనంత సేపు ఆకాశంలో విహరించండి. సెలవు!" అంటూ ఆమెకు నమస్కరించి, వెనుదిరిగి తల వంచుకుని వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ప్రతాపుడి వింత ప్రవర్తనకు కారణం ఏమిటి? వాడెంతో ధైర్యసాహసం, చాకచక్యం ప్రదర్శించి రెక్కల గుర్రాన్ని చేజిక్కించు కోగలిగాడు. రాజకుమారితో అతడి వివాహానికి మరి ఆటంకం ఏమీలేదు. అలాంటి శుభ సమయంలో వాడు భీరువులా వెనుకంజ వేయడమేమిటి? భూలోకాన్నుంచి గంధర్వ లోకానికి, అక్కడి నుంచి భూలోకానికి -- ఈ సమయంలో జరిగిన వాతావరణం లోని మార్పు, వాడికి చిత్తభ్రమ కలిగించ లేదు కదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రతాపుడు ధైర్య శాలేమో కాని, బుద్ధిశాలి మాత్రం కాదు. పూజారి గరుడాచారి వివరించే వరకూ వాడికి ఈ భూలోకం తప్ప మరింకా లోకాలున్న సంగతే తెలియదు. రాకుమారిని వివాహ మాడగోరడం ఉచితం కాదని, రెక్కల గుర్రం చెప్పే వరకూ, వాడికి తాను విద్యావిహీనుణ్ణనీ, ఏ క్షాత్రవిద్యలూ ఎరగని వాడి నన్న స్పృహ లేదు. గుర్రం చేసిన హితబోధ, వాడికి తనను తాను అంచనా కట్టుకోగల ఇంగితాన్ని కలిగించింది. అందువల్లనే వాడు, రాకుమారికి సెలవని చెప్పి వెళ్ళి పోయాడు. ఇందులో చిత్తభ్రమ అంటూ ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం: ఎన్.శివనాగేశ్వరరావు రచన]






# రాక్షసుడి వ్యాధి

ఒకానొక అరణ్యం దాపులనున్న ఊళ్ళో, రమణాచారిఅనే ఆయుర్వేద వైద్యుడుండే వాడు. ఆయనహస్తవాసి గొప్పదని అందరూ చెప్పుకునేవారు.ఆయనఇల్లునిత్యం రోగులతో కిటకిటలాడుతూండేది. అయితే, రమణా చారి ఎవరినీ ఇంత డబ్బు ఇవ్వమని అడిగే వాడు కాదు. ఎవరికివాళ్ళు వాళ్ళ తాహతును బట్టి యిచ్చేది తీసుకునేవాడు. పేదలకు ఉచితంగా వైద్యం చేసేవాడు.

ఆయన భార్య భానుమతికి, భర్త ఉదార బుద్ధి అంటే ఒళ్ళు మంట. వైద్యుడితో పెళ్ళి అనగానే ఆమె ఇంటి నిండా ఖరీదైన వస్తువులూ, ఒంటి నిండా రకరకాలైన నగలూ, అలా పిలిస్తేపలికేపనివాళ్ళూ అనే అందమైన కలలతో, ఆ ఇంట అడుగుపెట్టింది. అయితే, భర్త బొటా బొటి సంపాదనతో, ఆమెకన్న కలలేవీ ఫలించలేదు.

ఇలా వుండగా ఒకనాటి అర్ధ రాత్రి, ఎవరో తలుపు తడుతున్న శబ్దానికి భార్యాభర్తలిద్దరికీ మెలుకువ వచ్చింది. "ఈకొంపలో ఆయీ భాగ్యాల మాట దేవుడెరుగు, కంటి నిండా నిద్రపోయే భాగ్యం కూడా లేదేం!" అని విసుక్కుంటూ తలుపు తీయడానికి లేచింది భానుమతి. వెనగ్గా రమణాచారి కూడా వెళ్ళాడు.

తలుపు తెరుస్తూనే భార్యాభర్తలు నిలువెల్లా వణికి పోయారు. ఎదురుగా పెద్ద రాక్షసుడు! వాడు బాగా తలవంచి ద్వారం దాటి లోపలికి వస్తూనే, నేలమీద చతికిలబడి కాళ్ళు పిసుక్కుంటూ, "భయపడకండి! వెర్రి దాహం, ఒకటే నీరసం! నువ్వు గొప్ప వైద్యుడివని తెలిసివచ్చాను. అరికాళ్ళ మంటలు, నొప్పులు. నా బాధలకు నువ్వు వైద్యం చేయక తప్పదు!" అన్నాడు.

దానితో రమణాచారికి భయంపోయింది. భానుమతి కాస్త దూరంగా నిలబడి, రాక్షసుడికేసి బెదురుగా చూడ సాగింది. రమణాచారి, ఆవిడకు భయపడ వద్దని సైగ చేసి

మాచిరాజు కామేశ్వరరావు




రాక్షసుణ్ణి పరీక్షించి, ''నువ్వు వ్యాధి బాగా ముదిరాక వచ్చావు, అయినా ఫర్వాలేదు. నీది అసురమేహవ్యాధి. ఒక నెల్లాళ్ళ పాటు నా మందు సేవిస్తేఫలితం వుంటుంది,'' అని కొన్ని గుళికలు మింగించి, ఇంత కషాయం తాగించాడు.

రాక్షసుడు కృతజ్ఞతగా తల వూపి, ''రేపు ఈ వేళకే వస్తాను!'' అంటూ బయటికి వెళ్ళి పోయాడు.

తలుపు మూస్తున్న రమణాచారితో భాను మతి, ''నీ తెలివి తెల్లవారినట్టే వుంది. డబ్బు కోసం మనుషులను పీడించవు సరే ! ఈ బ్రహ్మరాక్షసిగాణ్ణి, ఇంత డబ్బు కక్కమని నిలదీయడానికేం?'' అన్నది కోపంగా.

అయితే, రమణాచారి ఎంతో శాంతంగా, ''చూడు భానూ! నాకు తెలిసిన విద్య వైద్యం. అది నలుగురికీ ఉపయోగపడితే, ఆనందం. దానిని వ్యాపారం చేయడం నాకు ఇష్టం లేదు,'' అన్నాడు.

భర్తను నమ్ముకుని లాభం లేదనుకుని, ఆమె మర్నాటి రాత్రి రాక్షసుడు రాగానే, ''చూడు, పెద మావయ్యా! నీ వైద్యానికి మీ అబ్బాయి నూరు కాసులు ఖర్చు పెట్టాడు. రేపు వచ్చేటప్పుడు, ఒట్టి చేతులతో రాకు,'' అన్నది.

భానుమతి మాటలు వింటూనే రాక్ష సుడు కస్సుమంటూ హుంకరించి, ''నువ్వేదో నాతో చుట్టరికం కలపాలనుకుంటున్నా వేమో, జాగ్రత్త ! నీ కల్లబొల్లి మాటలు, నా దగ్గర సాగవు. నేను అరణ్యంలో కంటబడిన మనిషి దగ్గర డబ్బు ఏ పాటి వున్నదో ముందు చూసి, ఆతర్వాత వాణ్ణి, ఏ పూట ఆహారంగా ఉపయోగించు కోవాలో ఆలోచిస్తాను. నన్నే డబ్బడుగుతావా, హూ హూ !'' అంటూ మరొకసారి హుంకరించాడు.

రాక్షసుడు ఇలా అనగానే, భానుమతి కుక్కిన పేనులా అయిపోయింది. అయితే, ఆవిడకు వాడి మాటల ద్వారా వాడు తన నివాసంలో చాలా డబ్బు దాచి వుంటాడని గ్రహించింది. ఎలా అయినా వాడు ఉంటున్న చోటు తెలుసుకుంటే డబ్బు కోకొల్లలు!

భానుమతి ఇలా ఆలోచించి, నాలుగు రోజుల తర్వాత, ఒక సాయంత్రం భర్తకు తాను పుట్టింటికి వెళ్ళి వస్తానని చెప్పి, ఊరి బయట పాడుపడిన సత్రం స్తంభం చాటున నక్కి కూర్చున్నది. ఆనాటి అర్ధరాత్రి రాక్షసుడు వైద్యం చేయించుకుని తిరిగి వెళుతూండగా, ఆమె వాణ్ణి అనుసరించి పోయి, వాడు ఉన్న స్థావరం, అరణ్యంలోని ఒక ఊడల మర్రి పక్కన గుహ అని తెలుసుకున్నది.

ధనపిశాచి ఆవహించిన భానుమతి, మర్నాటి పగలంతా అరణ్యంలో అక్కడా ఇక్కడా తిరిగి, అర్ధరాత్రి వేళ రాక్షసుడు వైద్యానికి గుహ వదిలి పోగానే, భయపడు తూనే గుహలోకి వెళ్ళింది. అక్కడ గుహ మూలగా, రెండు పెద్ద తోలుసంచులు కని పించాయి. వాటి మూతులు విప్పి చూసిన భానుమతికి, ఒక సంచీలో నగలూ, రెండవ దానిలో కళ్ళు మిరుమిట్లు గొలిపే బంగారు కాసులూ కనిపించాయి.




ఆమె ఎక్కడలేని ఆనందంతో, సంచు లను భుజానికి తగిలించుకుని , ఇల్లు చేరే సరికి తెల్లవారవస్తున్నది. ఆ సమయంలో రమణాచారి పెరట్లో ఉన్న బావి దగ్గర స్నానం చేస్తున్నాడు. భానుమతి సంచులను ఊర గాయ జాడీలుంచే అటక మీద భద్రంగా దాచింది. జరిగిందేమిటో భర్తకు మాత్రం చెప్పలేదు.

ఇప్పుడు, భానుమతికి ఆనందంతో పాటు నిస్సత్తువ పట్టుకున్నది. క్రితం రాత్రంతా అరణ్యంలో తిరగడంతో ఆమెకు కాళ్ళనొప్పులు, కళ్ళు బైర్లు కమ్ముతున్నట్టు బాధ. ఆ స్థితిలో ఆమె మంచం మీద పడు కుని చిన్నగా మూలగసాగింది.

స్నానం ముగించి వచ్చిన రమణాచారి ఎప్పుడొచ్చావంటూ ఆమెను తాకి చూసి, ''జ్వరం ! ఒళ్ళు కాలిపోతున్నది. వంటపని నేను చూస్తాను. విశ్రాంతిగా పడుకో,'' అంటూ ఆమె చేత ఏవో మాత్రలు మింగిం చాడు. ఆ రోజంతా ఒళ్ళు తెలియని మగత నిద్రలో వుండిపోయింది భానుమతి.

ఆ రాత్రి రాక్షసుడు మహాసంతోషంగా, పెద్ద పెద్ద అంగలతో రమణాచారి దగ్గరకు వచ్చి, ''నీ వైద్యం అమోఘంగా పనిచేసింది! నా బాధలన్నీ మటుమాయమయ్యాయి. నీకేదైనా కానుకలు యిచ్చి పోదామనుకు న్నాను. అయితే, నాసంపద అంతా ఎవరో కొల్ల గొట్టేశారు. అయినా, అంత ధనం పోయి నందుకు బాధ కలగడం లేదు. నువ్వన్న, ఆ అసురమేహ వ్యాధి నుంచి బతికి బయట పడ్డాను. అదే చాలు! నేనుండే చోటు ఎవరికో తెలిసిపోయింది. గనుక, ఇక నేనా అరణ్య ప్రాంతాల్లో వుండ దలచలేదు. మరొకదూరా రణ్యానికి పోతున్నాను. నీకు చాలా కృత జ్ఞుణ్ణి,'' అంటూ వెనుదిరగబోయి ఆగి, ''భయంగా ఉంది, ఒక వేళ, ఆ వ్యాధి మళ్ళీ తిరగబెడితే ఏం చేయాలి?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు రమణాచారి నవ్వి, ''కాస్త ఓపిక తెచ్చుకుని మరొకసారి, నా దగ్గరకు రావడమే!'' అన్నాడు.

రాక్షసుడు తలాడించి వెళ్ళిన మరు క్షణం, పక్కగది లోంచి భానుమతి భర్తను పెద్దగా కేక పెట్టి పిలిచి, "మీకు ఇంత వరకూ చెప్పలేదు. నాకు విపరీతమైన దాహం అవు తున్నది. అరికాళ్ళు మంటలు, నొప్పులు తగని నీరసం!" అంటూ బాధతో కళ్ళనీళ్ళు పెట్టు కున్నది.

రమణాచారి ఆమెను పరీక్షచేసి, "నీలో ఆ రాక్షసుడివ్యాధిలక్షణాలే కనబడుతున్నవి. విడ్డూరంగా వున్నది!" అన్నాడు ఆశ్చర్య పోతూ.

భర్తమాటలు వింటూనే, భానుమతి వెల వెల పోయి; రాక్షసుడు వాళ్ళనూ, వీళ్ళనూ చంపి కూడబెట్టిన పాపపుధనం కారణం గానే, వాడికంత భయంకర వ్యాధి వచ్చి వుంటుంది! ఆ ధనాన్ని తను దొంగిలించి తేవడమే, తనకూ వాడి వ్యాధి లక్షణాల కారణ మనుకుంటూ, భర్తకు తను చేసిందంతా చెప్పి, "నా ప్రాణం కంటే ఆ సంచుల్లో వున్న బంగారం విలువైనది కాదు. వాటిని అటకపై నుంచి దించి పెరటి బావిలో పారేయండి," అన్నది తొందరపెడుతూ.

రమణాచారి అటకమీది నుంచి సంచులు దించి వాటిలో వున్న బంగారాన్ని చూసి అబ్బురపడుతూ, "భానూ! ధనం పవిత్రమైనది. దాన్ని దాచిపెట్టి దుష్ట ప్రయోజనాలకు ఉపయోగించేవాడే అప విత్రుడు. ఇంత ధనాన్నీ, మనం బావిలో పారవేయ నవసరంలేదు. మన గ్రామాధికారి చాలా ధర్మాత్ముడు. దీన్ని మనం ఆయన కిస్తే, పది మందికీ మేలు జరిగే పనులకు ఉపయోగించ గలడు, ఏమంటావు?" అన్నాడు.

"అలాగే చేయండి ! ఒళ్ళునొప్పులతో ప్రాణం పోతున్నట్టున్నది," అన్నది భానుమతి నీరసించిన గొంతుతో.

అప్పుడు రమణాచారి, భార్య నాడి పరీక్షించి, "ఈ సోకిన వ్యాధి గురించి భయ పడకు! ఆ రాక్షసుడి కిచ్చిన కషాయం లాంటిదే నీకూ ఇస్తాను. తెల్లవారే సరికి ఎప్పటిలా ఇంటి పనులు చేసుకోగలవు," అంటూ భానుమతి వీపు తట్టి ధైర్యం చెప్పి, కషాయం తయారు చేయడానికి పక్క గది లోకి వెళ్ళాడు.





# స్వర్ణ సింహాసనం

7

[కౌండిన్య దేశపు యువరాజు విజయదత్తుడి వివాహానంతరం, రాజగురువు సలహాప్రకారం నగరమైదానంలో జరిపిన తవ్వకాలలో స్వర్ణసింహాసనం బయటపడింది. విజయదత్తుడు పట్టాభిషేకానికి సిద్ధమై, స్వర్ణసింహాసనం తొలిమెట్టుపై అడుగు మోపగానే, అక్కడి సాలభంజిక సత్యశక్తి వారించింది. తాను అడిగే ప్రశ్నకు సమాధానం చెప్ప మని, త్రిపురాంతక రాజ్యాన్ని పాలించిన మూర్ఖరాజు కథ చెప్పింది. సత్యశక్తి అడిగిన ప్రశ్నకు విజయదత్తుడు-న్యాయనిర్ణయంలో రాజు పాటించవలసిన ధర్మమార్గాన్ని వివరిస్తూ, సరైన సమాధానం చెప్పాడు. సత్యశక్తి స్వాగతం పలికింది. రెండవ సాలభంజిక ధర్మశక్తి కథ చెప్పడం ప్రారంభించింది. -తరవాత]

సువర్ణగిరి దేశానికి రాజు కుశధ్వజుడు. అతడు చాలా ఉత్తముడూ నిర్మలహృదయుడూ అయిన రాజు. మంత్రుల సలహా సహకారాలతో అతడి పరిపాలన కూడా చెప్పుకోదగినదిగా వుండి, ప్రజలు అతడంటే ప్రాణం పెట్టేవారు.

కుశధ్వజ మహారాజుకు ఒకే ఒక్క మగబిడ్డ సంతానం. ఆ కుర్రవాడు పసివయసులోనే అసామాన్యమైన ప్రజ్ఞాపాటవాలు కనబరుస్తూండటంతో, మంత్రులు అతడిని, అత్యుత్తమ శిక్షకుడుగా పేరుపొందిన కృష్ణచంద్రుడి గురుకులానికి పంపవలసిందిగా సలహా ఇచ్చారు. కుశధ్వజుడు, వారి సలహా ప్రకారమే, బాలుడైన మలయధ్వజుణ్ణి స్వయంగా తీసుకువెళ్ళి, కృష్ణచంద్రుడికి అప్పగించాడు.

విద్యాభ్యాసం ప్రారంభించిన తొలి రోజుల్లోనే, గురువు మెప్పు సంపాదించిన మలయధ్వజుడు, విద్యాభ్యాసం పూర్తయ్యే నాటికి కృష్ణచంద్రుడికి, అత్యంత ప్రీతిపాత్రుడైన శిష్యుడయ్యాడు. అతడి విద్యాభ్యాసం పూర్తయి, మరికొద్దిరోజుల్లో అతడు స్వదేశానికి

లక్ష్మీ గాయత్రి



తిరిగి వెళతాడనగా, హఠాత్తుగా ఒకనాడు, పొరుగు రాజు వజ్రకీర్తి, సువర్ణగిరిపై దొంగ దెబ్బ తీశాడనీ, అంతఃపురంలో గాఢనిద్రలో వున్న కుశధ్వజ మహారాజు, భార్యా సమేతంగా నిద్రలోనే చంపబడ్డాడనీ, సువర్ణ గిరి కోటలో వజ్రకీర్తి ప్రస్తుతం నివసిస్తున్నాడనీ, వార్తలందాయి.

పిడుగుల్లాంటి ఆ వార్తలు వింటూనే స్తంభించి పోయిన, మలయధ్వజుణ్ణి, కృష్ణ చంద్రుడు ఓదార్చి, "మలయధ్వజా! నీకు కలిగిన దుఃఖం సామాన్యమైనది కాదు. తట్టుకోవడానికి చాలా గుండె నిబ్బరం కావాలి. అయితే, ప్రస్తుత పరిస్థితుల్లో, నీ భవిష్యత్తు గురించి ఆలోచించటం చాలా ముఖ్యం. నీ ప్రాణానికి కూడా ఏ క్షణానైనా ముప్పు వాటిల్ల వచ్చు," అన్నాడు.

మలయధ్వజుడు విషాదంగా నిట్టూర్చి, "అవును, గురుదేవా! రక్తం రుచి మరిగిన పులి, వేట సాగిస్తూనే వుంటుంది. భయపడి చాటుగా దాగివుంటే ప్రమాదానికి అంతం అనేది రాదు. మీదపడి ఒక్కవేటుతో ఆ పులినే వేటాడితే, ఇక అంతా నిశ్చింతే!" అన్నాడు.

అతడి మాటలకు కొద్దిసేపు ఏదో ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయిన కృష్ణ చంద్రుడు చివరకు, "నువ్వు చెప్పిందీ నిజమే, నాయనా! నీ సూక్ష్మమైన మేధస్సు, నీ ధైర్య సాహసాలు బాగా ఎరిగివున్న వాడిని కనుక, నిన్ను పంపటానికి సాహసిస్తున్నాను. నీ ఆత్మ విశ్వాసమే నీకు శ్రీరామరక్ష! క్షేమంగా వెళ్ళి విజయాన్ని సాధించు," అంటూ ఆశీర్వదించాడు.

గురువు ఆశీస్సులు పొందిన మలయ ధ్వజుడు, సాధారణ వేషం ధరించి, తన చంద్ర హాసాన్నీ, గుర్రాన్నీ మాత్రం తీసుకుని, గురువుకు చివరిసారిగా పాదాభివందనం చేసి బైలుదేరాడు.

అలా బైలుదేరిన మలయధ్వజుడు, ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేస్తూ, మర్నాటి సాయంత్రానికి సువర్ణ గిరికి దాపులనే వున్న ఒక భిల్లరాజ్యాన్ని చేరుకున్నాడు. ఆ రాజ్యం చిన్నదైనప్పటికీ, స్వతంత్రరాజ్యం. దాన్ని పాలించే సింహగుప్తుడు కుశధ్వజ మహా రాజుకు ఆప్తమిత్రుడు.

తనను చూడవచ్చిన పరదేశిని చూస్తూనే, అతడిని మలయధ్వజుడుగా అనుమానించిన సింహగుప్తుడు తక్షణం అతణ్ణి ఏకాంత మందిరానికి తీసుకుపోయాడు.

తను అడగ బోతూండగానే ఏకాంతం కల్పించిన సింహగుప్తుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంటూ నిర్భీతిగా తనను తాను ఆయనకు పరిచయం చేసుకున్నాడు మలయధ్వజుడు.

ఆమరుక్షణం, సింహగుప్తుడు అమితోత్సాహం తో, "భగవంతుడు, నా మొర ఆలకించి, నిన్ను నా దగ్గరకు పంపించాడయ్యా! మా సైనికులు సిద్ధంగా వున్నారు. నేను కూడా నీతో వస్తాను. ఇటు నీ దేశానికీ, శత్రువు వజ్రకీర్తి దేశానికీ కూడా రాజుగా నిన్ను అభిషేకించనిదే నా మనసుకు అసలు శాంతి వుండదు," అన్నాడు.

ఇందుకు మలయధ్వజుడు, "మహారాజా! మీకు, నా పట్లగల అభిమానానికి ఎంతైనా కృతజ్ఞుణ్ణి. అయితే, సైన్యంతో వెళ్ళి మనం విజయం సాధించగల అవకాశాలు తక్కువ. వజ్రకీర్తికి ప్రస్తుతం రెండు దేశాల తాలూకు సైనికబలం వున్నది. అతడు నా తండ్రిని ఎలా దొంగదెబ్బ తీశాడో, నేను కూడా అలాగే చాపకింద నీరులా అతణ్ణి హత మార్చాలన్నదే నా ఆలోచన. అంతేకాక, వజ్రకీర్తికి మా సైన్యాధికారులు ఎవరో బాగా సహాయ పడి వుండాలి. వాళ్ళెవరో కూడా తెలుసుకుని శిక్షించాలి," అన్నాడు.

సింహగుప్తుడు ఆశ్చర్యంగా, "నీ ఆలోచన వరకూ బాగానే వున్నది. కాని, అది అంత సులభంగా సాధ్యమయ్యే పనేనా?" అని ప్రశ్నించాడు.

"భగవత్కృపవల్ల నా బుద్ధికి నీ అదృష్టం కూడా తోడైతే ఇది చిటికెలో సాధించగల పనే!



మీరు చెయ్యవలసిన సహాయమల్లా నాతో బాటు ఒక చురుకైన యోధుణ్ణి పంపటం. నాకు కొద్దిపాటి డబ్బూ, నగలతోపాటు, రకరకాల విషాలు పూసి ఎండించిన సూదుల్ని కొన్ని ఇవ్వటం. అంతే!" అన్నాడు మలయధ్వజుడు.

మలయధ్వజుడి మాటల్లో ధ్వనిస్తున్న ఆత్మవిశ్వాసానికి ముగ్ధుడైన సింహగుప్తుడు అంగీకారంగా తలాడిస్తూ, "సరే నీ ఇష్టం! రేపు ఉదయానికల్లా అన్నీ సిద్ధంగా వుంటవి. ఈ రాత్రికి నిశ్చింతగా విశ్రాంతి తీసుకో," అన్నాడు.

ఆ ప్రకారమే ఒక నూనూగు మీసాల యువకుణ్ణి వెంటబెట్టుకుని, మర్నాటి ఉదయానికల్లా మలయధ్వజుడి దగ్గరకు స్వయంగా వచ్చిన సింహగుప్తుడు, తన వెంట



వున్న యువకుణ్ణి, మలయధ్వజుడికి చూపిస్తూ చిరునవ్వుతో, "నాయనా! నీ గురించి విన్న ఈ యోధుడు, తనను నీకు పరిచయం చెయ్యవలసిన అవసరం లేదనీ, నువ్వే సులభంగా తెలుసుకో గలవనీ, అంటున్నాడు," అని చెప్పాడు.

ఆ మాటలు విన్న మలయధ్వజుడు, సింహ గుప్తుడు పరోక్షంగా తనను పరీక్షిస్తున్నాడని గ్రహించి, చిన్నగా నవ్వి యోధుడితో, "యువరాణి శాలినీదేవి అంతటి బుద్ధిశాలిని, నా వెంట రావటం, నాకు చాలా ఆశాభావాన్నీ, ఆనందాన్నీ కలిగిస్తున్నది," అన్నాడు.

ఆ మాటలకు యోధుడి వేషంలో వచ్చిన సింహగుప్తుడి కుమార్తె శాలిని, సిగ్గుతో తల వంచుకోగా, సింహగుప్తుడు ముగ్ధుడై చిన్నగా చప్పట్లు చరిచి, "ఆహా! ఇంతకూ ఆమె నా కుమార్తె అని ఎలా తెలుసుకో గలిగావు?" అని ప్రశ్నించాడు.

"యుద్ధ విద్య నేర్చిన మీ కుమార్తె వుండగా, వేరెవర్నో నాతో పంపటానికి మీరు ఇష్టపడరని గ్రహించాను. అందుకే వచ్చిన వ్యక్తి శాలిని అయివుంటుందను కున్నాను," అన్నాడు మలయధ్వజుడు.

ఆ జవాబు తండ్రికీ,కుమార్తెకూ కూడా తృప్తి కలిగించలేదు. అయితే, సరైన కారణాన్ని ఎందుచేతనో అతడు చెప్పదలుచు కోలేదని గ్రహించిన సింహగుప్తుడు, మరి రెట్టించక, "నువ్వు కోరిన వస్తు సామగ్రీ, మీకు గుర్రాలూ, ఆహారమూ అన్నీ సిద్ధంగా ఉన్నవి. విజయోస్తు!" అంటూ వాళ్ళను బైలుదేర దీశాడు.

పగలంతా ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేసిన వాళ్ళిద్దరూ సాయంత్రానికి ఒక అడవి ప్రాంతానికి చేరుకుని అక్కడ కొద్దిపాటి విశ్రాంతి కోసం ఆగారు. ఆ సమయంలో శాలిని, "ఉదయం మీరు చెప్పిన కారణం, అసలైనది కాదని మీకూ తెలుసు! పురుషవేషం ధరించి వచ్చినది నేనేనని, ఎలా గ్రహించారో తెలుసు కోవచ్చునా," అని ప్రశ్నించింది.

ఆ ప్రశ్నకు మలయధ్వజుడు, "యుద్ధ విద్యలు నేర్చిన వీరవనితలు, ఆయా సంఘటనల్లో పాల్గొంటున్నపుడు తమ సహజ స్వభావాన్నీ, సౌకుమార్యాన్నీ విస్మరించ వచ్చుగాక ! కాని, సాధారణ పరిస్థితుల్లో వారి సౌకుమార్యం, లజ్జా శీలత, చంచల నేత్రాలు -వీటిని దాచటం సాధ్యపడదు. మిమ్మల్ని

పట్టిచ్చినదీ స్వభావమే! మీరు ఒక స్త్రీ అని గ్రహించాక, యువరాణి శాలిని అయివుంటారని ఊహించడం కష్టమేమీ కాదు గదా!'' అన్నాడు.

అతడి మాటలకు సిగ్గుపడుతూ, ముఖాన్ని మరొకవైపుకు తిప్పుకున్న శాలిని, క్షణకాలంలో సర్దుకుంటూ, "మీ ఆత్మవిశ్వాసం అమోఘం! మీకు విజయం తథ్యం,'' అన్నది.

తర్వాత కొద్దిసేపట్లోనే తిరిగి బయలు దేరిన వాళ్ళిద్దరూ, రాత్రి మొదటి జాము దాటే సరికి, సువర్ణగిరి పొలిమేరలు చేరుకుని, గుర్రాలను అక్కడే వదిలివేసి, కాలి నడకన నగరంలో ప్రవేశించారు.

మలయధ్వజుడు, పరిశీలనగా చుట్టూ చూస్తూ, ప్రధాన రాజవీధులు వదిలి వేసి, సామాన్యులు నివసించే ఇళ్ళవైపు దారి తీశాడు.

నిర్మానుష్యంగా వున్న, ఆ వీధుల్లో నడుస్తూండగా ఒక ఇంట్లోంచి ఎవరో నెమ్మదిగా మాట్లాడుకుంటున్న గుసగుస ధ్వని వినిపించింది. వెంటనే మలయధ్వజుడు, ఆ ఇంటి అరుగు మీదికి ఎక్కి, చెవి ఒగ్గి విన సాగాడు. శాలిని అతడిని అనుసరించింది.

లోపలి నుంచి, ఒక స్త్రీ స్వరం, నెమ్మదిగా, "అయితే పాపం యువరాజును కూడా చంపేస్తారన్నమాట,'' అంటున్నది.

దానికి జవాబుగా, ఒక పురుషస్వరం, "ఓసి, పిచ్చిదానా! రాజ్యకాంక్షతో ధర్మాధర్మాలు మరిచి ప్రవర్తించిన వజ్రకీర్తిలాంటి వాడు, యువరాజును మాత్రం వదులుతాడా. అయినా, అతడినని ఏం లాభం! కందర్పుడి లాంటి గాదెకింది పందికొక్కులు, పొరుగు దేశపు శత్రువులకంటే హానికరమైన వాళ్ళు.



అలాంటి వాళ్ళను ఖండ ఖండాలుగా నరికి, కాకులకూ, గద్దలకూ వెయ్యటంకంటే ధర్మం మరొకటి లేదు!'' అన్నది.

"ఏమిటీ? మన సైన్యాధికారి కందర్పుడే!'' అన్నది స్త్రీ స్వరం కాస్త పెద్దగా.

వెంటనే పురుష స్వరం, "ఉష్, నెమ్మది. ఎవరైనా వింటే కొంపలంటుకుంటవి. అర్ధరాత్రి కావస్తున్నది. పడుకో పడుకో,'' అన్నది.

తర్వాత లోపలినుంచి ఇంకే మాటలూ వినరాలేదు. కొద్దిసేపు ఆగి, మలయధ్వజుడు ఇంటి తలుపును సున్నితంగా తట్టాడు. ఒక క్షణం తర్వాత, అంతకు ముందు మాట్లాడిన పురుషస్వరం, లోపలి నుంచి బెదురుగా, "ఎవరదీ?''అంటూ ప్రశ్నించింది.

"మిత్రులం!''అంటూమలయధ్వజుడు జవాబిచ్చాడు.



తానెవరైనదీ గురన్నకు చెప్పి, అతడు చేయ వలసిన సహాయం ఏమిటో వివరించాడు. అతడు కోరిన సహాయం గురించి వింటూనే గురన్న భయపడ్డాడు.

అది గమనించిన మలయధ్వజుడు, తన దుస్తుల్లోంచి ఒక ముత్యాల హారం తీసి గురన్నకు ఇవ్వబోయాడు. గురన్న చప్పున వారిస్తూ, "వద్దు బాబూ, ఇప్పుడ లాంటి వేమీవద్దు. ఎవరి కంటనైనా పడితే ప్రమాదం," అని కాసేపు తటపటాయించి, చివరకు, "సరే బాబూ! చచ్చిపోయిన మహారాజుగారి ముఖం చూసి కాదనలేక పోతున్నాను. మీరు మాత్రం రెండవజాము కాస్త గడవగానే వచ్చెయ్యండి," అని చెప్పి మలయధ్వజుడికి పాదాభివందనం చేసి వెళ్ళి పోయాడు.

గురన్న వెళ్ళగానే సుకేతుడు శత్రు రాజుకు సాయపడిన సేనాధిపతి కందర్పుడి శయన మందిరాన్ని కావలి కాసే వీరన్నను తీసుకు వచ్చాడు. మలయధ్వజుడు తానెవరైనదీ చెప్పగానే, ఒక్కసారి వీరన్న భయంతో తెల్ల బోయాడు.

అతడి ముఖంలో దాచుకుందామన్నా దాగని ఆశ్చర్యం కనిపించింది. ఆ వెను వెంటనే యువరాజు రాకపట్ల, తన ఆనందాన్ని వ్యక్తం చేసిన వీరన్న, యువరాజు కోరిన సహాయం చెయ్యటానికి ఏ అభ్యంతరమూ చెప్పకుండా, తక్షణం అంగీకరించాడు.

వెంటనే మలయధ్వజుడు, తన దుస్తుల్లోంచి ఒక చిన్న సూదిని తీసి, ఏం జరుగు తున్నదీ వీరన్న గమనించే లోగా, అతడి

ఒకటి రెండు నిమిషాల తర్వాత ఇంటి యజమాని తలుపు తెరవగానే, మలయ ధ్వజుడు, శాలినితో పాటు ఇంట్లో ప్రవేశించి, వెంటనే తలుపు తిరిగి మూసి, భయంపడుతూ చూస్తున్న అతడికి తానెవరైందీ చెప్పాడు.

స్వయానా యువరాజే తనఇంట అడుగు పెట్టాడని తెలుసుకున్న ఇంటి యజమాని సుకేతుడు, ఆశ్చర్యానందాలతో ఉప్పొంగి పోయాడు. అతడి ద్వారా తనకు కావలసిన వివరాలన్నింటినీ తెలుసుకున్న మలయ ధ్వజుడు, వ్యూహ రచన ప్రారంభించాడు.

ఆ మర్నాటి ఉదయాన సుకేతుడు, మలయధ్వజుడు కోరినట్టుగా, వజ్రకీర్తి శయనాగారపు కావలిభటుడు గురన్నను ఇంటికి తీసుకువచ్చాడు. మలయధ్వజుడు

చేతిమీద పొడిచాడు. వీరన్న తేలు కుట్టినట్టు ఉలిక్కిపడి చేతిని విదిలిస్తూపెద్దగా అరుబోయాడు. అయితే తగు జాగ్రత్తలో వున్న మలయధ్వజుడు, చప్పున వీరన్న నోటిని గట్టిగా మూసి, శాలినీ, సుకేతుల సహాయంతో అతడి ని బంధించాడు.

తర్వాత, సుకేతుడి ద్వారా వీరన్న భార్యనూ, అతడి ఒక్కగానొక్క బిడ్డమూడేళ్ళ పసివాణ్ణి కూడా రప్పించి వాళ్ళు కూడా ఏం జరుగు తున్నదీ గమనించేలోగానే, సూదులతో వాళ్ళను పొడిచాడు. వాళ్ళిద్దరూ కిమ్మన కుండా మరు క్షణమే స్పృహతప్పి నేలకు జారిపోయారు.

మలయధ్వజుడు, బాధతో విల విలలాడు తున్న వీరన్నను సమీపిస్తూ, కటువుగా, నీ మనసులోని దుర్మార్గపుటాలోచన గ్రహించాను. ఆ ఆలోచన నీ మనసుకు తట్టి నందుకే తేలు విషం నీ శరీరంలోకీ, మత్తు మందు నీ భార్యా పిల్లల శరీరాల్లోకీ ప్రవేశించింది. ఇక నైనా ఆ దురాలోచనలు మాని, నేను చెప్పి నట్టు చేశావంటే సరే సరి! లేదా, ముందు నీ భార్యా పిల్లలకూ, తర్వాత నీకూ ఏకంగా త్రాచు పాము విషం ఇవ్వక తప్పదు. ఏం చెయ్య దల్చు కున్నావో నీ ఇష్టం,'' అన్నాడు.

ఆ మాటలు విన్న వీరన్న గుడ్ల నీళ్ళు కుక్కుకుంటూ, మలయధ్వజుడు చెప్పినట్టు చేస్తానన్నట్టుగా సైగచేస్తూ , భయంతో వణికి పోతూ చేతులు జోడించాడు. ఆ వెంటనే మలయధ్వజుడు, అతడికి విరుగుడు మందు ఇచ్చి, ''నేటి రాత్రికే పని జరిగి పోవాలి. రేపు ఉదయం దాకా నీ భార్యా పిల్లలిద్దరూ ఇక్కడ ఇలాగే వుంటారు. ఎవరైనా అడిగితే, వాళ్ళు సుకేతుడి ఇంట వున్నారని చెప్పు. తెల్లవారే లోగా అంతా సక్రమంగా పూర్తి చేస్తివా, రేపు ఉదయం వాళ్ళను సజీవులుగా చూస్తావు,'' అంటూ అతణ్ణి బంధించిన కట్లు విప్పి వదిలాడు. -(ఇంకావుంది)



**ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు - తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!**

## 6. నాగరికత వెలసిన మహారణ్యం!

నదీతీరంలో దేవనాథుడికి కుడివైపున నడుస్తూన్న శ్యామల, "తాతయ్యా! పొద్దున మీరు చెప్పిన కొన్ని ప్రాంతాల పాత పేర్లు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. పూర్వ కాలంలో నివసించిన గొప్పవాళ్ళను అవి మనకు గుర్తు చేస్తున్నాయి," అన్నది.

"అలాంటి పేర్ల వెనక గొప్ప వ్యక్తులే గాక, గొప్ప పనులు కూడా ఉన్నాయి కదా తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు తాతయ్యకు ఎడమవైపున నడుస్తూ.

దేవనాథుడు దాపుల కనిపించిన సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు. నదికి ఆవల కొండల మధ్య సూర్యుడు అస్తమిస్తున్నాడు.

"మన ప్రాచీన చరిత్ర చాలా క్లిష్టమైనది. కేవలం వ్యక్తులూ, వాళ్ళు చేసిన ఘనకార్యాలూ కారణంగానే కొన్ని ప్రదేశాలకు ఆ పేర్లు వచ్చాయని చెప్పలేము. అయితే, ఒకటి మాత్రం నిజం. మునులు తమ అపారకరుణ కారణంగా గొప్ప వ్యక్తులనూ, ఘనకార్యాలనూ మాత్రమే కాకుండా, తమ కాలంలో జరిగిన అసాధారణ సంఘటనలను కూడా భావితరాలు మరిచిపోకూడదన్న ఆశయంతో కొన్ని ప్రాంతాలకు ఆ పేర్లు పెట్టారని నేను భావిస్తున్నాను," అన్నాడు దేవనాథుడు.

"అలాంటి సంఘటనను మరిచిపోతే మాత్రం ఏం? అప్రయోజకుడైన వ్యక్తికి ఆ సంఘటనద్వారా ప్రజల మనసులలో అమరత్వం కలిగించడం వల్ల జరిగే ప్రయోజనం ఏమిటి?" అని అడిగాడు సందీపుడు.

"అప్రయోజకులకూ, దుర్మార్గులకూ అమరత్వం ప్రసాదించ వలసివచ్చినప్పటికీ అలాంటి సంఘటనలను తప్పకుండా గుర్తుపెట్టుకోవాలి. ఆ మాటకు వస్తే శ్రీకృష్ణుణ్ణి గుర్తుపెట్టుకోవాలంటే కంసుణ్ణి కూడా గుర్తుంచుకోవాలి కదా? కాబట్టి కొన్ని సంఘటనల నుంచి దుర్మార్గులను పూర్తిగా విడదీసి చూడలేము," అన్నాడు దేవనాథుడు.

"అలా పేరువచ్చిన ఒక ప్రాంతాన్ని చెప్పండి తాతయ్యా!" అని అడిగింది శ్యామల అన్నయ్యకేసి చూసి నవ్వుతూ.



విశ్వావసు



# ప్రకృతి -చరిత్ర



''దండకారణ్యాన్ని చెప్పవచ్చు, ఇది దండకుడనే ఒకరాజును సూచిస్తుంది. వాడు ఎలాంటి ధర్మాన్నీ పాటించనివాడు,'' అన్నాడు దేవనాథుడు.

''దండకారణ్యమా? దానిని గురించి నేను రామాయణంలో చదివానే! అది కల్పిత అరణ్యం కాదా?'' అని అడిగింది శ్యామల.

''అది కల్పితఅరణ్యం అని నువ్వెలా అనుకున్నావు? ఈనాడు ప్రపంచంలోని అడవులలో ముఖ్యమైనది దండకారణ్యం. అది అతి ప్రాచీనమైన అరణ్యం మాత్రమే కాదు; గొప్ప నాగరికతకు నిలయంగానూ ఉండేది. దండకారణ్యంతో సరితూగగల అరణ్యం ప్రపంచంలో మరెక్కడా లేదు,'' అన్నాడు దేవనాథుడు.

''అది పూరాణ కాలానికి, అంటే రామాయణ కాలానికి చెందినది కదా? అది ఇప్పుడు ఉన్నదా?'' అని అడిగింది శ్యామల తాతయ్యను మరింత కుతూహలంగా.

''మనదేశంలో మనం యేటా ఇరవై నాలుగు వేల హెక్టార్లకు పైగా అడవులను నిర్మూలిస్తున్నాం. అందువల్ల నీ అనుమానం న్యాయమైనదే. అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. అవును శ్యామలా! రామాయణంలోని అనేక ఘట్టాలకు వేదిక దండకారణ్యం. ఇక్కడే శ్రీరాముడు మునుల యజ్ఞానికి భంగం కలిగించిన రాక్షసులను వధించాడు. రావణుడి చెల్లెలు, రాముణ్ణి పెళ్ళాడమనికోరి లక్ష్మణుడి చేత భంగపాటుకు గురైనది కూడా ఇక్కడే. ఈ అరణ్యం నుంచే రావణుడు సీతాదేవిని అపహరించుకుని వెళ్లాడు. రావణుడి దుండగానికి అడ్డు తగిలి జటాయువు ధర్మావేశంతో పోరాడి ప్రాణాలర్పించింది ఈ అడవిలోనే. అరణ్యం మరీ ప్రాచీనమైనప్పటికీ, ఈనాటికీ ఆంధ్ర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, ఒరిస్సా ప్రాంతాలలో దట్టంగా విస్తరించి ఉన్నది!'' అన్నాడు దేవనాథుడు.

''తాతయ్యా ! దానికి దండకారణ్యం అనే పేరెలావచ్చింది? దాని వెనక ఉన్న కథ ఏమిటి?'' అని అడిగాడు సందీపుడు.



దేవనాథుడు ఇలా చెప్ప సాగాడు :

ఒకానొకప్పుడు ఆ సువిశాల ప్రాంతాన్ని దండక వంశస్థులు పాలిస్తూ వచ్చారు. ఆ వంశానికే చెందిన దండకుడనే రాజు యువకుడు. అతడికి సదా సర్వ వేళలా సుఖాలలో తేలియాడడం తప్ప మరో ధ్యాస ఉండేది కాదు. ఒకనాడతడు అడవిలో గుర్రం







మీద వెళుతూ, సరోవరంలో స్నానంచేసి వస్తూన్న ఒక యువతిని చూశాడు. మానవులలో అటువంటి అందాలరాశి ఉంటుందని దండకుడు ఊహించలేక పోయాడు. ఆమె అప్సరస కాదు కదా అని ఆశ్చర్య పోయాడు.

ఆ యువతి రాజు కేసి ఒక్క క్షణం చూసి మందహాసం చేసి, తనదారిన వెళ్ళసాగింది.



దండకుడు గుర్రం పైనుంచే ... ఆమెను వెంబ డించి మరీ దగ్గరికి చేరాడు.

"అడవిలో దారితప్పి వచ్చావా? నావల్ల ఏమైనా సహాయం కావాలా?" అని అడిగింది యువతి.

"నేను ఏమార్గంలో వెళ్ళినా అది నా మార్గమే అవుతుంది. ఎందుకంటేవాటన్నిటికీ నేనే అధిపతిని; ఈ రాజ్యానికి రాజును. ఇక నీ రెండవ ప్రశ్న. అవును, నాకు నీ సహాయం తప్పకకావాలి. నువ్వు నన్ను ఈ క్షణమే పెళ్ళాడాలి!" అన్నాడు దండకుడు.

ఆ మాటకు యువతి దిగ్భ్రాంతి చెందింది. మరుక్షణమే కోలుకుని, "నువ్వు ఈ రాజ్యానికి రాజు నంటున్నావు. నాకు నమ్మశక్యం కాలేదు. రాజు అన్నవాడికి కొన్ని ధర్మాలు, సంప్రదాయాలు తెలిసివుండాలి. ఒకపురుషుడు, ఒక కన్యను వివాహ మాడాలంటే రెండే రెండు మార్గాలున్నాయి. ఒకటి ఆ యువతి ఆ పురుషుణ్ణి వివాహమాడ టానికి సమ్మతించాలి. లేదా ఆ యువతి తల్లి దండ్రులు ఆ వరుడికి తన కుమార్తెను ఇవ్వడానికి అంగీకరించాలి. అప్పుడే ఒక పురుషుడు, ఒక స్త్రీని వివాహమాడ డానికి సాధ్యమవుతుంది. నిన్ను పెళ్ళాడడానికి నేనూ సమ్మతించలేదు. నాతండ్రి అంగీకారాన్నీ నువ్వు పొందలేదు. మరి నన్నెలా వివాహమాడగలవు?" అని అడిగింది.

రాజు పకపకా నవ్వి, "యువతీమణీ! రాజైన నన్ను అల్లుడిగా పొందడాన్ని ఏతండ్రయినా మహాభాగ్యంగా భావిస్తాడు. ఈ సంప్రదాయాల మీద నాకు పట్టింపులు లేవు. అయినా మనం రాజభవనం చేరగానే, మంత్రుల ద్వారా నీతండ్రికి కానుకలు పంపి సంగతి తెలియజేద్దాం!" అంటూ ఆమె చేయి పట్టుకోబోయాడు.

"వదులు నాచెయ్యి, దుష్టుడా! నీరాజ్యంలోని సంపద లన్నిటినీ కానుకలుగా పంపినా, నా తండ్రి శుక్రాచార్యుడు నీ కోరికకు సమ్మతించడు. ఆయన మునిపుంగవుడు. మనిషిలోని మంచి తనానికి తప్ప మరిదేనికీ విలువ నివ్వడు!" అంటూ ముని కుమారి అరజ ఆ రాజు చేయి విదిలించుకుని పరిగెత్తసాగింది.

దండకుడు ఆమెను వెంబడించి మళ్ళీ పట్టు కున్నాడు. వాడి పట్టునుంచి బయట పడడానికి అరజ చాలాసేపు పెనుగులాడింది. నెత్తురు గాయాలతో బయటపడి, "దుర్మార్గుడా! ఈ రాక్షస కృత్యానికి ఫలితం అనుభవిస్తావు," అని శపించి



దాపులనున్న పొదల చాటుకు వెళ్ళి తప్పించుకుని పారిపోయింది.

ఆమె తన తండ్రి శుక్రాచార్యుడి కుటీరానికి చేరింది. శుక్రాచార్యుడు ధ్యానం ముగించి అప్పుడే కళ్ళు తెరిచాడు. ఎదుట ఒంటినిండా గాయాలతో నిలబడ్డ తన గారాలపట్టిని చూసి, ''ఏమయింది తల్లీ?'' అని అడిగాడు.

అరజ కన్నీళ్ళు కారుస్తూ కొంతసేపు ఏమీ మాట్లాడ లేక పోయింది. తండ్రి మళ్ళీ మళ్ళీ అడగడంతో జరిగినదాన్ని తడబాటుతో చెప్పింది. శుక్రాచార్యుడు కొంతసేపు మౌనంగా వుండి, తన కుమార్తెను వేధించి నిర్బంధించినవాడు రాజు దండకుడనీ, రాజ్యంలో నెలకొన్న అరాచక పరిస్థితులకు దండకుడి దుష్ప్రవర్తన మచ్చు తునక అనీ భావించాడు. ఆయన యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞకుండం నుంచి వెలువడిన ఉగ్ర శక్తులను, ''రాజ్యాన్ని సర్వనాశనం చేయండి. సజ్జనులు, సాధువులు, జంతువులు తప్ప సర్వం అగ్నికి ఆహుతి కావాలి!'' అని ఆదేశించాడు.

దండకుడి రాజప్రాసాదంలో ఆరంభమైన అగ్ని కీలలు అడవి చుట్టుపక్కల వున్న పట్టణాలనూ, పల్లెలనూ చుట్టుముట్టాయి. దండకుడు పాలించిన ప్రాంతమంతా భస్మమయ్యేవరకు రాత్రింబవళ్ళు ఆకాశాన్నందే మంటలు చల్లారలేదు. బతికి బయటపడిన సాధువులు దూరప్రాంతాలకు తరలి వెళ్ళారు. అలాగే జంతువులు కూడా వెళ్ళిపోయాయి.

వందల మైళ్ళు ఎటుచూసినా బూడిద రాసులే! కాల క్రమంలో గాలులకూ, ఋతుపవనాలకూ కొట్టుకు వచ్చి పడిన విత్తనాల కారణంగా చిన్నచిన్న మొక్కలు మొలకెత్తసాగాయి. ఆ తరవాత కొన్ని వందల సంవత్సరాలకు మళ్ళీ అక్కడ క్రమంగా దట్టమైన అడవి ఏర్పడింది.

కొన్ని శతాబ్దాలు గడిచేసరికి ఒకవైపు మునులకు నిలయంగానూ, మరొకవైపు రాక్షసులకు నివాసస్థానంగానూ ఆ మహారణ్యం మారిపోయింది. ఆ మహారణ్యం ఏర్పడటానికి కారణభూతుడూ, దుర్మార్గుడూ, దురదృష్టవంతుడూ అయిన దండకుడి పేరు మీదుగా మునులు దానికి దండకారణ్యం అని పేరు పెట్టారు! -(ఇంకావుంది)





# గాడిద గర్వం

శివపురం సమీప ఆశ్రమంలో వుంటూన్న అభయానంద స్వామికి, చుట్టుపక్కల గ్రామాలలోని తన శిష్యులు ఆహ్వానిస్తే, వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి రావడం అలవాటు. ఆయన కాలినడకనే వెళ్ళి వచ్చే వాడు. కొన్నేళ్ళకు ఆయన వృద్ధుడైపోవడంతో అలా నడిచి వెళ్ళడం వల్ల అలిసి పోయేవాడు. అయినా ఆయన దానిని బయట చెప్పుకునే వాడు కాదు.

ఒకరోజు ఆయన శిష్యుడొకడు ఒక గాడిదను వెంట బెట్టుకుని వచ్చి, "స్వామీ, తమరు రాళ్ళు రప్పలలో కాలినడకనే మా ఇళ్ళకు రావడం నాకు బాధగా ఉన్నది. క్షమించండి! నాకు గుర్రాన్ని కొనే తాహతు లేదు. ఇది చాలా మంచి గాడిద; బలమైనది. ఇది మీకు ఉపయోగంగా ఉంటుంది," అన్నాడు.

అభయానందస్వామి మందహాసంచేసి, "శిష్యులు భక్తి ప్రపత్తులతో సమర్పించే దేనినైనా స్వీకరించడం గురువునైన నా ధర్మం. గుర్రం అయినా గాడిద అయినా వాహనం వాహనమే!" అన్నాడు.

మరునాడు గురువు ఒక జమీందారు ఇంటికి వెళ్ళవలసి వచ్చింది. గురువు గాడిద మీద ఎక్కి కూర్చున్నాడు. శిష్యులు గాడిదకు రెండువైపులా నడిచి వెళ్ళారు. జమీందారు ఇంటిముందు గురువుకు స్వాగతం చెప్పడానికి చాలామంది స్త్రీ పురుషులు నిలబడ్డారు. గురువును చూడగానే వాళ్ళందరూ సాష్టాంగ నమస్కారం చేశారు. గాడిదకు ఆశ్చర్యం కలిగింది. గాడిదపైనుంచి కిందికి దిగక ముందే ఆయన మెడలో పూలదండ వేశారు. దండలో నుంచి కొన్ని పూలు గాడిద తలపై రాలాయి. దాంతో గాడిద ఉప్పొంగి పోయింది!

గురువు దిగి భవనం లోపలికి వెళ్ళగానే, జమీందారు సేవకులు గాడిదను కొట్టం లోకి తీసుకు వెళ్ళి కట్టేశారు.

దానిని చూడగానే అక్కడున్న గాడిదలు, "నువ్వు చాలా గొప్ప దానివి! మా జాతిలో పుట్టిన నువ్వు ఇన్ని గౌరవ సత్కారాలు పొందడం మాకెంతో గర్వంగా

పి.రాజా

ఉన్నది!'' అన్నాయి. దాంతో గురువుగారి గాడిద పొంగి పోయింది. తాను కూడా గొప్పదాని ననే భావం దానికి ఏర్పడింది.

ఒకరోజు గడిచాక గురువు భవనం నుంచి వెలుపలికి వచ్చాడు. అంతలో సేవకులు గాడిదకు బాగా మేత పెట్టి తీసుకువచ్చి, ఆయన ముందు నిలబెట్టారు. గురువు దానిపై ఎక్కికూర్చుని ఆశ్రమానికి చేరుకున్నాడు.

ఆనాటి నుంచి గురువు గాడిద మీద ఎక్కడికి వెళ్ళినా, జమీందారు భవనం ముందు శిష్యులు చేసినట్లే, అందరూ ఆయన గాడిదపైనుంచి దిగక ముందే సాష్టాంగ నమస్కారం చేసేవారు. వాళ్ళందరూ తనకే దణ్ణాలు పెడుతున్నట్టు భావించి పొంగి పోసాగింది గాడిద.

కార్తీక పౌర్ణమి పర్వదినం సందర్భంగా గురువు వరసగా మూడు రోజులు జమీందారు ఇంటికి వెళ్ళవలసి వచ్చింది. జమీందారు ఇంటికి వెళ్ళాలంటే గాడిదకు ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకువచ్చేది. తనకు అక్కడ లభించే మేత, గౌరవ మర్యాదలు మరెక్కడా లభించడం లేదనే విచారం కూడా గాడిదకు ఉండేది.

జమీందారింట్లో పౌర్ణమి వ్రతం పూర్తయ్యాక ఆశ్రమానికి తిరిగివచ్చిన గురువు, ఆ తరవాత ఒక వారం వరకు మరెక్కడికీ వెళ్ళలేదు.

ఒకరోజు వేరొక శిష్యుడు వచ్చి ఆహ్వానించడంతో, గురువు ఆయన ఇంటికి వెళ్ళాలనుకున్నాడు బయటకు రాగానే గాడిదకు సంతోషమయింది. గురువు ఎక్కి కూర్చున్నాడు. శిష్యులు దానిని ఆహ్వానించిన భక్తుడి ఇంటికేసి నడిపించారు. వారందరూ నాలుగు బాటల కూడలిని చేరారు. ఆ నాలుగు బాటలలో ఒకటి జమీందారు భవనం కేసి వెళుతుంది. దానికి ఎదురుగా వున్న బాట, ఇప్పుడు గురువును ఆహ్వానించిన భక్తుడి ఇంటికేసి వెళుతుంది. గాడిద జమీందారు ఇంటి కేసి నడవసాగింది. శిష్యులు దానిని అడ్డుకున్నారు. అయినా అది తిరగలేదు. దానిని బలవంతంగా దారి మళ్ళించడానికి శిష్యులు ప్రయత్నించారు. అంతే ! గాడిద కోపంతో గురువును వీపు పైనుంచి కింద పడదోసి, జమీందారు భవనం కేసి పరిగెత్తింది.

భవనం సమీపించాక, అది వసారాలోకి వెళ్ళి, అక్కడినుంచి ఇంకా లోపలికి వెళ్ళడానికి అడుగు వేయబోయింది. దానిని చూసిన జమీందారు సేవకులు కర్రలతో గాడిదను నాలుగు బాది బయటకు తరిమారు.

గాడిద ఓండ్ర పెడుతూ, కుంటుకుంటూ వీధిలోకి వచ్చి, ''నేనెవరో గుర్తు పట్టలేక పోయారు వాళ్ళు, పాపం!'' అనుకుంటూ విచారపడుతూ వెళ్ళి పోయింది.





# పనిపిల్ల నవ్వింది!

బొపన్న అనే భూస్వామి, ఒక రోజున పొలానికి బయల్దేరాడు. పాలేరు భీమయ్య కూతురు పదేళ్ళ శాంత నెత్తిమీద చద్ది గంప పెట్టుకుని ఆయన వెంట వెళ్ళింది. రోజంతా పొలం దగ్గరుండి బాపన్న అవసరాలు చూస్తూం డడం దాని పని.

ఆయన అడిగినప్పుడల్లా మంచినీళ్ళు తెచ్చిస్తుంది. మధ్యాహ్నం భోజనం వడ్డిస్తుంది. ఏపనికీ విసుక్కోదు. ముఖమెప్పుడూ ప్రశాంతంగా వుంటుంది. అందుకని శాంత ంటే, బాపన్నకు చెప్పలేనంత ఇష్టం.

ఆరోజున బాపన్న భోజనంచేశాక పొలంగట్టు మీదకాలు జారివెల్లికిలా పడ్డాడు. లేద్దామంటే పట్టుదొరకలేదు. బాపన్నది భారీశరీరం కాబట్టి, శాంత చెయ్యందించినా లాభం లేదు. అందుకని, ఆయన శాంతను వెళ్ళి ఎవర్నయినా పిలుచు కుని రమ్మన్నాడు.

అయితే దగ్గర్లో ఎవరూ లేరు. శాంత పక్క పొలంలోకి వెళ్ళింది. అక్కడ భూషయ్య అనే ఇంకొక భూస్వామి వున్నాడు. జరిగింది విని ఆయన, "మహా బాగా అయిందిలే ! నన్ను తిట్టిన వాడికి తగిన శాస్తి జరిగింది," అన్నాడే తప్ప, సాయానికి తను వస్తాననలేదు. అంతకు ముందు రోజే ఏదో విషయంలో బాపన్నా ఆయనా గొడవపడ్డారు.

శాంత, భూషయ్య ప్రవర్తనకు నొచ్చు కుంటూ తిరిగి వస్తూంటే పేరయ్య అనే పాలేరు కనిపించాడు. వాడు బాపన్నకు జరిగింది విని, "ఆయనకు కూలినాలి జన మంటే రవంత జాలి, కరుణ లేవు. అలా కాసేపు పడివుండనీ! నేలమీద పడుకోవడ మంటే తెలిసొస్తుంది," అన్నాడే తప్ప సాయం చేస్తాననలేదు.

ఆ తర్వాత శాంతకు పొలంపనులకు అప్పుడే వస్తున్న నాగన్న సోమన్న అనే ఇద్దరు రైతులు కనిపించారు. శాంత వారికి బాపన్నకు వచ్చిన కష్టం చెప్పింది. అది వింటూనే సోమన్న పకపకానవ్వి, "అంత భారీమనిషి వున్న పళంగా వెల్లకిలా పడిపోతే చూడ్డానికి భలే బాగా వుంటుంది. నువ్వు అదృష్టవంతు

శ్రీరామకమల్

రాలివే, శాంతా! చాలా గొప్పదృశ్యం చూశావు. అయ్యో, నాకా అదృష్టంకలగలేదు.'' అంటూ నిట్టూర్చాడు.

నాగన్న మాత్రం సోమన్నను మందలించి, శాంతతో బయల్దేరి వెళ్ళాడు. అప్పటి కింకా బాపన్న వెల్లకిలా పడిపోయే వున్నాడు. నాగన్న ఆయనకు చెయ్యందించి అతి కష్టంమీద లేవ దీసి, ''తమకు వయసు మీరుతున్నది. తోడులేకుండా పొలానికి రాకుండి, బాబూ! రోజులు కూడా బాగా లేవు. ఉపకారబుద్ధి నశించిపోతున్నది. నేను, మీశాంతముఖంలో పుట్టెడు దిగులు చూసి జాలిపడి వచ్చాను,'' అంటూ అంతవరకూ శాంతకు జరిగిన అనుభవాలన్నీ ఏకరువుపెట్టాడు.

బాపన్న శాంతవైపు చూస్తే, నిజంగానే అది సర్వం పోగొట్టుకున్నదానిలా కనబడింది. ఆయన దాన్ని ఓదార్చుతూ, ''నాకేం కాదులే, ఊరికే భయపడకు. ఇక ఇంటికి పోదాం పద,'' అన్నాడు.

అప్పుడు బాపన్న బట్టలన్నీ మట్టి కొట్టుకుని పోయివున్నాయి. వళ్ళంతా బురద. నాగన్న ఆయనకు దగ్గర్లోని రైతు నడిగి, రెండెడ్ల బండి ఎక్కించి ఊళ్ళోకి పంపాడు. శాంత కూడా ఆయనతో వెళ్ళింది.

ఇల్లు చేరగానే బాపన్న భార్య సూరమ్మ ఎదురొచ్చి, ''ఈ అవతార మేమిటండీ!'' అంటూ కిలకిలా నవ్వింది.

''పొలంలో పడిపోయాను. నా అవస్థ చూసి పాలేరు కూతురు పదేళ్ళ శాంతే దిగులుతో కుమిలి పోతూంటే, నీకు నవ్వెలా వచ్చిందీ?'' అంటూ బాపన్న చిరాకు పడ్డాడు.

ఇది విన్న శాంత మరింతగా దిగులు పడుతూ, పెరట్లో వున్న బాపన్న కోడలు దగ్గరకు పోయి, ''అమ్మా! నేనొకసారి సుబ్బుల్ని చూసి వచ్చేదా?'' అని అడిగింది.



''సుబ్బులుతో నీకేంపని?'' అన్నది బాపన్న కోడలు ఆశ్చర్యంగా. ఈ సుబ్బులు కూడా పదేళ్ళు. శాంత, బాపన్న ఇంట్లో పని చేస్తున్నట్టే, సుబ్బులు కూడా పక్కింట్లో పని చేస్తుంటుంది.

''అయ్యగారు పొలంలో పడిపోయారని దానికి చెప్పాలమ్మా!'' అన్నది శాంత ఎంతో విచారంగా.

''ఈమాత్రం దానికి ఇప్పుడే వెళ్ళాలా? పనులన్నీ అయ్యాక వెళ్ళు,'' అన్నది బాపన్న కోడలు.

శాంత గిన్నెలు తోమింది. బట్టలుతికింది. ఇలా పనులన్నీ అయ్యాక సూరమ్మ శాంతను పిలిచి, దొడ్లో వడియాలు ఆరబెట్టాను. వాటిని కాకులెత్తుకు పోకుండా కాపలా కాయమన్నది. శాంత దిగులుగా కూర్చున్నది, ఆరబెట్టిన వడియాలు కాపలాకాస్తూ. అంతలో అటు వచ్చాడు భీమయ్య. శాంత తండ్రిని చూసి,

"నాన్నా! ఒకసారి సుబ్బులుతో మాట్లాడి వస్తాను," అన్నది.

కూతుర్ని గమనిస్తున్న భీమయ్యకు అదీ, సుబ్బులూ అయ్యగారు పడిపోవడం గురించి ఏం మాట్లాడుకుంటారో తెలుసుకోవాలని పించింది. వాడు శాంతకు తెలియకుండా దాన్ననుసరించి వెళ్ళాడు.

పక్కింటి పెరట్లో పశువులపాక ఒకటి వున్నది. అందులో ఒక మూలగా గడ్డిమేటు వున్నది. అంతవరకూ పెరట్లో మొక్కలకు పాదులు తవ్వుతున్న సుబ్బులు, శాంతను చూస్తూనే, చేస్తున్న పని ఆపి, పరుగున గడ్డి మేటు వెనక్కువెళ్ళింది.

"ఏమిటే విశేషాలు?" అని అడిగింది సుబ్బులు. "ముందు నువ్వే ఏమైనా విశేషాలుంటే చెప్పు," అన్నది శాంత.

విశేషాలేమీ లేవన్నట్టుగా తలూపింది సుబ్బులు.

అప్పుడు శాంత దిగులుగా, "అయ్యగారు పొలంలో పడిపోయారు!" అన్నది.

"ఎలా?" అని అడిగింది సుబ్బులు.

"ఇలా!" అంటూ బాపన్న ఎలా పడ్డాడో వివరించి చెప్పి, "ఏంచేయను? అయ్యగారు పడిపోగానే నాకు బోలెడు నవ్వొచ్చింది. కాని నవ్వితే ప్రమాదం కదా! నవ్వడానికి లేదని దిగులుపుట్టుకొచ్చింది. అయ్యగారి పాటు విన్న ప్రతివాళ్ళూ, అమ్మగారితో సహా స్వతంత్రంగా తోచినమాట అంటున్నారు. మనకు అలా అనేందుకు స్వతంత్రం లేదు కదా అని దిగులు పెరిగింది. నీ దగ్గరికొచ్చి హాయిగా నవ్వుతుంటే, ఎంతో బావుంటుం దను కుంటే, ఎప్పటికీ వెళ్ళనివ్వరు. నా దిగులంతా నవ్వే అవకాశం రావడం లేదనే!" అన్నది శాంత.

భీమయ్య ఇక వారి మాటలు వినలేదు. తన కూతురు అందరు పిల్లల్లా చదువు కుంటూ, కులాసాగా ఆడుకోవడం లేదని, అప్పటికి వాడికి అర్థమయింది.

వాడు ఇంటికి వెళుతూనే జరిగిందంతా భార్యకు చెప్పి, "మనం మన పిల్లలకు స్వతంత్రం లేకుండా చేస్తున్నాం. మనం కష్ట పడ్డా ఫరవాలేదు. రేపటి నుంచి శాంతను బడికి పంపిద్దాం," అన్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకు శాంతకే కాదు, సుబ్బులుకూ స్వతంత్రం వచ్చింది. ఆ ఊళ్ళో అస్వతంత్రులైన పిల్లలు ఒక్కరూ లేరు.





బృహదీశ్వరాలయం

తొమ్మిదవ శతాబ్దం నుంచి పదమూడవ శతాబ్దం వరకు దాదాపు నాలుగు వందల సంవత్సరాలు కావేరీ డెల్టాను చోళ రాజులు పరిపాలించారు. ఆర్థికాభివృద్ధిలో చోళుల కాలాన్ని స్వర్ణయుగంగా వర్ణిస్తారు. తంజావూరు రాజధానిగా పరిపాలించిన చోళులు సంగీతం, సాహిత్యం, నాట్యం, చిత్రలేఖనం మొదలైన లలితకళలను పోషించారు.

చోళరాజులలో అగ్రగణ్యుడైన మొట్టమొదటి రాజరాజ చోళుడు (క్రీ.శ. 985-1014) తంజావూరులో బ్రహ్మాండమైన బృహదీశ్వరాలయాన్ని నిర్మించాడు. ఈ దేవాలయ నిర్మాణం పూర్తి కావడానికి ఆరు సంవత్సరాలు పట్టింది. రాజ్యంలోని 370 గ్రామాల ప్రజలు దేవాలయ నిర్మాణానికి విరాళాలిచ్చారు. గోపుర విమానం కింది భాగంలో, గోపురం మీద దాతల పేర్లను శిలలపై చెక్కించే సంప్రదాయాన్ని రాజరాజె ఆరంభించాడు. విగ్రహాలు, నగలు, బంగారం, భూముల రూపంలో దేవాలయానికి విరాళాలిచ్చిన దాతల పేర్లు తెలియజేసే దాదాపు యాభై శిలాశాసనాలు ఇక్కడ ఉన్నాయి. రాజరాజు, ఆయన సోదరి కుందవై ఆలయానికి అత్యధికంగా విరాళాలిచ్చారు.

---

## కావేరీ తీర ప్రయాణం - 9

# చోళుల వైభవం

రచన : జయంతి మహాలింగం : చిత్రాలు: గౌతమ్‌సేన్

---

చోళుల శిల్పకళాశైలికీ, నైపుణ్యానికీ ఈ దేవాలయాన్ని విశిష్టమైన ఉదాహరణగా చెప్పవచ్చు. త్రిభుజాకారం మధ్య విమానం నిర్దుష్టమైన పొందికతో 64 మీ॥ ఎత్తులో ఉన్నది. ఈ అష్ట కోణాకృతి శిఖరం దాదాపు 80 టన్నుల బరువు గల పెద్ద నల్లరాతి బండమీద అమర్చబడి ఉన్నది. బ్రహ్మాండమైన ఈ బండను గోపురం మీదికి చేర్చడానికి - గోపుర శిఖరం నుంచి దాదాపు ఆరు కి. మీ. దూరంలో వున్న వయలూర్ గ్రామం నుంచి ఏటవాలుగా దృఢమైన మంచెను కట్టుకుంటూ వచ్చారని చెబుతారు. బ్రహ్మాండమైన ఏకశిలా నంది విగ్రహం ప్రత్యేక మంటపంలో ఉన్నది. 3.6 మీ॥ ఎత్తూ, 6 మీ॥ పొడవూ కలిగిన దాని బరువు 25 టన్నులు. 3 మీ॥ ఎత్తయిన శివలింగం రెండంతస్థుల పానవట్టం మీద అమర్చబడి వున్నది. పూజారులు నిచ్చెన మీద ఎక్కి, శివలింగానికి అభిషేకం చేస్తారు. ఆలయంలో వున్న మంటప స్తంభాలలో అందమైన శిల్పాలు ఉన్నాయి. గర్భగృహానికి లోపలి వైపూ, వెలుపలా వున్న గోడలలో భరతనాట్యానికి సంబంధించిన 108 భంగిమలలో శిల్పాలు మలచబడి



తంజావూరు శైలి చిత్రపటం

ఉన్నాయి. శివలీలలను వివరించే శిల్పాలూ, శివ భక్తులైన నాయన్మార్ల జీవిత విశేషాలను తెలియజేసే ఘట్టాలూ శిల్పాలుగా, కుడ్యచిత్రాలుగా మలచ బడి ఉన్నాయి.

చోళుల అనంతరం ఈ ప్రాంతాన్ని దాదాపు యాభై సంవత్సరాలు పాలించిన పాండ్యులు- ఆలయ ప్రాంతంలోనే పెరియనాయకిదేవి ఆల యాన్ని నిర్మించారు.

అల్లావుద్దీన్ ఖిల్జీ సేనానాయకుడు మాలిక్ ఖాఫర్, సుల్తాన్ తరఫున కావేరి డెల్టాను ఆక్ర మించాడు. అయితే 1377వ సం॥ లో విజయ నగర పాలకుడు బుక్కరాయల కుమారుడు కంపన్న, సుల్తానును మదురైలో ఓడించాడు. ఆ తరవాత దాదాపు 200 సంవత్సరాలు విజయ నగర రాజులకు సామంతులైన నాయక రాజులు ఈ ప్రాంతాన్ని పాలించారు. నాయకరాజులు తంజావూరులో బ్రహ్మాండమైన మహల్‌ను నిర్మిం చారు. సాహిత్య సంగీత పోషకుడైన రఘునాథ నాయకుడే (1600-34) సరస్వతీ మహల్‌లోని తాళపత్ర గ్రంథాలయాన్ని ప్రారంభించి వుండ వచ్చని చెబుతారు.

మహారాష్ట్రులు తంజావూరు పాలకులైన ఉదంతం ఆసక్తి కరమైన విషయం. విజయనగర పతనానంతరం- తంజావూరు బిజాపూరు సుల్తా నుల పాలనలోకి వచ్చింది. బిజాపూరు సుల్తాను తన ఆస్థానంలోని ప్రముఖుడు షహాజీకి తంజా వూరును జాగీరుగా ఇచ్చాడు. షహాజీ అనంతరం ఆయన కుమారుడైన వెంకోజీ (ఏకోజీ)కి వార సత్వంగా సంక్రమించింది. ఏకోజీ మరాఠా నాయకుడు ఛత్రపతి శివాజీకి సవతి సోదరుడు. బిజాపూర్ పతనానంతరం ఏకోజీ తన రాజ్యాన్ని స్వతంత్రరాజ్యంగా ప్రకటించుకుని 1674వసం॥ లో రాజయ్యాడు. శివాజీ కూడా ఆసంవత్సరమే పట్టాభిషిక్తుడు కావడం విశేషం. 18వ శతాబ్దాంతంలో ఆంగ్లేయులు వచ్చి భరణం ప్రకటించినంతవరకు మహారాష్ట్రులే తంజావూరును పరిపాలించారు. సంపన్నమైన తంజావూరు సాంస్కృతిక చరిత్రను మహారాష్ట్రులు మరింత పరిపుష్టం చేయడానికి కృషి చేశారు. ముఖ్యంగా 17౭8వ సం॥ లో రాజ్యాభిషిక్తుడైన తుల్జాజీ, ఆయన కుమారుడు శరభోజీ కృషి మరింతచెప్పుకోతగ్గది. శరభోజీ తరంగంబాడి లోని డేనిష్ ప్రొటెస్టెంట్ మిషనరీలో విద్య నభ్యసించాడు. ఆయనకు బాల్యం నుంచే పాండిత్యం పట్ల ఆసక్తి ఏర్పడింది. మహల్ గ్రంథాలయంలో పండితులకు ఉద్యోగాలు ఏర్పాటు చేసి భారతదేశంలోని వివిధ విద్యా కేంద్రాల నుంచి తాళపత్ర గ్రంథాలను సేకరించి, ప్రతులు తీసి భద్రపరచడానికి ఏర్పాటు చేశాడు. ఈనాడు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో సంస్కృతం, తమిళం, తెలుగు, మరాఠీ, పర్షియన్, ఉర్దూ, కొన్ని ఐరోపా భాషలకు చెందిన దాదాపు 22,000 తాళపత్ర గ్రంథాలు ఉన్నాయి. వీటిలో వైద్యశాస్త్రం నుంచి వ్యాకరణం



తంజావూరు సోదరులుగా పేరు గాంచిన పొన్నయ్య, వడివేలు, చిన్నయ్య

వరకు విభిన్న విషయాలకు సంబంధించిన గ్రంథాలు ఉన్నాయి. శరభోజీ సేకరించిన వివిధ వస్తువులు గల ప్రదర్శన శాల ఒకటి కూడా ఉన్నది. ఈరాజభవనంలో ఒక మూల ఎనిమిది అంతస్థుల గోపురం, గణేశమందిరం; బృహదీశ్వరాలయంలో నటరాజ మంటపం మొదలైన వాటిని విజ్ఞుడూ, వితరణశీలీ అయిన ఈ పాలకుడు నిర్మించాడు.

చోళులూ, మహారాష్ట్రులూ సంగీత నాట్యాలను బాగా ఆదరించి పోషించారు. మహారాష్ట్ర పాలకులు తమ ఆస్థానంలో 360 మంది సంగీత విద్వాంసులను పోషించారు. రాజులే కొన్ని కృతులను రచించారు. భరతముని నాట్యశాస్త్రం ఆధారంగా రూపొందిన భరత నాట్యాన్ని తొలుత దేవదాసీలు ప్రదర్శించేవారు. దాదాపు 400 దేవదాసీ కుటుంబాలు ఉండేవి. రాజరాజు కాలం నుంచి వారికి ఆలయం చుట్టూవున్న వీధులలో నివాసం ఏర్పాటు చేయబడింది. ఆ రోజుల్లో భరత నాట్యాన్ని సదిరాట్టం అనీ, దాసిఆట్టం అనీ అనేవారు.

19వ శతాబ్దారంభంలో తంజావూరుకు చెందిన నలుగురు నాట్యాచార్యులు ఈ సదిరాట్టం సంప్రదాయానికి ఒక నిర్దిష్ట రూపాన్నిచ్చి, శాస్త్రీయ నృత్యంగా తీర్చి దిద్దారు. తంజావూరు సోదరులుగాప్రసిద్ధి గాంచినపొన్నయ్య, చిన్నయ్య, శివానందన్, వడివేలు- భరత నాట్యంలో విప్లవాత్మక మైన మార్పులు ప్రవేశపెట్టి, దానికి తంజావూరుకు వెలుపల కూడా ప్రాచుర్యం కలిగించారు. వాళ్ళు మొదట సుప్రసిద్ధ కర్ణాటక వాగ్గేయకారుడు ముత్తుస్వామి దీక్షితుల వద్ద కొంతకాలం శిక్షణ పొందారు.

చిత్రలేఖనం లోనూ తంజావూరు శైలికి ప్రత్యేక స్థానం ఉన్నది. తంజావూరు

రెండవ శరభోజీ మహారాజు



చిత్రాలు దృఢమైన రేఖలూ, సునిశితమైన రంగులూ, మధ్య మధ్య అద్దాలు, మెరిసే మణులు, బంగారు ఆకులు పొదగడం ద్వారా అందరినీ అలరించి ఆకర్షించాయి. ఈ రోజు కూడా సంప్రదాయ వాద్య కళాకారులు తంజావూరు లో తయారయ్యే వీణలు మృదంగాలు, తంబూ రాలు అంటే ఎంతో ఇష్టపడతారు.

కర్ణాటక సంగీతంలో త్రిమూర్తులుగా ప్రఖ్యాతి గాంచిన త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి తంజావూరు సమీపం లోని తిరువారూరులోనే జన్మించారు. ముగ్గురూ సమకాలీనులే. త్యాగరాజు అక్కడి నుంచి కావేరిలో మరి మూడునదులు సంగమించే తిరువయ్యారుకు చేరుకున్నారు. ఇక్కడ "పంచన దీశ్వర" ఆలయం అనే అందమైన దేవాలయం ఉన్నది. ఏప్రిల్- మే నెలల మధ్య గుడిలోని ఉత్సవమూర్తిని పల్లకీలో ఊరేగింపుగా తీసుకు వెళతారు. తిరువయ్యారులో ఆరంభమై- తిరుప్పళనం, తిరుచోర్రుతుర్తై, తిరువెంగుడి, తిరుకండయూర్, తిరుపూంతురుత్తి, తిల్లై స్థానం గ్రామాల గుండా ఊరేగింపుగా వెళ్ళి, మళ్ళీ ఆలయాన్ని చేరుకుంటుంది. పల్లకీ వెంట వెళ్ళే భక్త జనులు భక్తి గీతాలు పాడు కుంటూ వెళతారు.



సుప్రసిద్ధ వాగ్గేయకారుడు త్యాగరాజు

త్యాగరాజు తన జీవితమంతా తిరువయ్యారులోనే గడిపారు. శ్రీరాముడి పరమభక్తుడైన త్యాగరాజు మాతృభాష అయిన తెలుగులోనూ, సంస్కృతంలోనూ కీర్తనలు రచించారు. సంగీతం, భక్తి విడదీయరానిదనీ, అదే ఇహ పర సుఖాలను ప్రసాదిస్తుందనీ భావించిన పరమ భాగవతోత్తము డాయన! అయితే, త్యాగరాజు అన్నగారికి ఆ ధోరణి నచ్చలేదు. తమ్ముడి ప్రవర్తన సోమరితనంగా కనిపించింది. త్యాగరాజు రోజూ పూజించే రాముడి విగ్రహాన్ని తీసుకెళ్ళి నదిలో పారేశాడు. అది త్యాగరాజుకు తీరని క్షోభను కలిగించింది. ఆవేదనతో నదీ తీరానికి వెళ్ళి రాముణ్ణి తిరిగి రమ్మని భక్తితో కీర్తనలు ఆలపించారు. కావేరీ నదీ గర్భంలోని విగ్రహం పైకి తేలింది. అలా తేలిన విగ్రహమే ఇప్పుడు త్యాగరాజు సమాధివద్ద ఉన్న విగ్రహం అని చెబుతారు.

తిరువయ్యారు సమీప నదీతీరంలో త్యాగరాజు సమాధి ఉన్నది. సుప్రసిద్ధ సంగీత విద్వాంసురాలు బెంగుళూరు నాగరత్నమ్మ 1920 ప్రాంతంలో దీనిని పునరుద్ధరించారు. యేటా జనవరి నెలలో జరిగే త్యాగరాజ ఆరాధన ఉత్సవాలలో వేలాదిమంది సంగీత విద్వాంసులూ, అభిమానులూ పాల్గొంటారు. త్యాగరాజు విగ్రహాన్ని అభిషేకించి పూజిస్తారు. త్యాగరాజ "పంచరత్న కీర్తనలను" విద్వాంసులు ఆలపిస్తారు.

ఒక వైపు నిండుగా ప్రవహించే కావేరీ జలాలు. మరోవైపు భక్తితో పొంగిపొరలే గీతాలాపనలు సాగే ఆరాధనోత్సవంలో పాల్గొనడం మరపురాని అద్భుత అనుభూతిని కలిగిస్తుంది.



# భద్రుడి చిరాకు

వేములవాడ గ్రామంలో వుండేఉదయనుడి వ్యాపారదక్షత చెప్పకోతగ్గది. పాతికేళ్ళ వయసుకే అతడు గ్రామంలో ప్రముఖుడని పించుకున్నాడు. అందుకు తల్లితండ్రు లెంతో సంతోషించి, ''నాయనా! వ్యాపారాన్ని బాగా వృద్ధి పరచాలంటూ ఇంతకాలం పెళ్ళి వాయిదా వేశావు. ఇక ముహూర్తం పెట్టించ మని, నీ బావకు కబురు పంపమంటావా?'' అన్నారు.

ఉదయనుడి అక్క పంకజం అతడి కంటే పన్నెండేళ్ళు పెద్దది. ఆమెకు పదహారో ఏటే భద్రుడనే సంపన్నుడితో పెళ్ళయింది. ఏడాది తిరక్కుండా ఆ దంపతులకు పుట్టిన కూతురు అరుణ. పుట్టగానే ఆమె ఉదయ నుడి భార్య అని అంతా అనుకున్నారు.అందుకు ఉదయనుడికీ పెద్దగా అభ్యంతరం లేక పోయింది. అరుణ గురించి అతడెక్కువగా ఏనాడూ పట్టించుకోలేదు కానీ, బావ భద్రుడంటే వల్లమాలిన గౌరవం. ఆయన చిన్నప్పుడు అతడికి ఎన్నో కథలు చెప్పే వాడు. సరదాగా మాట్లాడే వాడు. అతడంటే ఆయనకు చాలా ఇష్టం. ఉదయనుడుండే గ్రామానికి దూరంగా, ఘనాపురం అనే గ్రామంలో వుంటున్నాడాయన అక్కడాయనకు లంకంతఇల్లు వుంది. పాతికెకరాల పొల ముంది. పది మందిలో మంచి పేరుంది. అరుణ తర్వాత ఇద్దరు కొడుకులు కూడా కలిగారాయనకు.

ఇప్పుడు తల్లి తండ్రులు పెళ్ళి ప్రసక్తి తేగానే ఉదయనుడు, ''అంతా మీ ఇష్ట ప్రకారు కానివ్వండి!'' అంటూ తన అంగీకారం తెలిపాడు.

అతడి తల్లిదండ్రులు వెంటనే విషయం తెలియపరుచుతూ, భద్రుడికి కబురంపారు.

ఇప్పటికి అయిదేళ్ళ క్రితం భద్రుడు సకుటుంబంగా అత్తమామలింటికి వచ్చాడు.

''వసుంధర''



అప్పుడు అరుణ గ్రామం చుట్టూ వున్న పంట పొలాలూ, తోటలూ చూపిస్తాడని ఉదయనుడి చుట్టూ తిరిగింది. అతడామెను బొత్తిగా పట్టించుకోలేదు సరికదా, తనను విసిగించవద్దని మందలించాడు. తన వ్యాపారం గొడవే తప్ప, ఇతరులు చెప్పేది వినాలన్న ధ్యాసే లేదతడికి. ఈ ధోరణి చూసి, అప్పట్లో పదిహేనేళ్ళ వయసులో వున్న అరుణ ఎంతగానో నొచ్చుకుంది. మేనమామ అంటే బాగా కోపం కలిగింది. ఆ కోపం ఇప్పటికీ అలాగే వుండిపోయింది.

రెండేళ్ళ క్రితం ఉదయనుడి తల్లిదండ్రులు, ఘనాపురంలో కూతురింట నాలుగు రోజులుండి వచ్చారు. ఉదయనుడు తనకు తీరికలేదని వాళ్ళతో వెళ్ళలేదు.

ఇంటికి వచ్చిన అమ్మమ్మ, తాతగార్లతో అరుణను మంచి కాలక్షేపమయింది. అరుణ సౌందర్యం, గుణగణాలు వాళ్ళకు నచ్చాయి. ఆమె దగ్గర వాళ్ళు ఉదయనుడి మంచితనాన్నీ, తెలివితేటలనూ విపరీతంగా పొగడి, తొందరలోనే ఇద్దరికీ పెళ్ళి జరిపిస్తామన్నారు. అరుణ అప్పుడేమీ మాట్లాడలేదు. మేనమామ ఒకవేళ మంచివాడేమోనని సరిపెట్టుకున్నది.

ఇప్పుడు పెళ్ళిగురించిన కబురు రాగానే అరుణ, తల్లితో తనకు ఉదయనుడంటే ఇష్టం లేకపోవడానికి కారణం చెప్పింది. పంకజం నవ్వి, ''నా తమ్ముడి గురించి నీకంటే నాకే బాగా తెలుసు. వాణ్ణి పెళ్ళి చేసుకుంటే నువ్వు కలకాలం సుఖంగా వుంటావు,'' అని నచ్చ జెప్పచూసింది.

అరుణ మాత్రం అయిష్టంగా తలవూపి వూరుకున్నది. పంకజం ఈ విషయం భద్రుడికి చెప్పింది. భద్రుడు నవ్వి, ''ఇదేం పెద్దసమస్యకాదు. అమ్మాయికి ఉదయనుడి మీద వున్న అపార్థాలన్నీ పోగొట్టాలంటే ఇద్దరూ కలిసి నాలుగు రోజులు కబుర్లు చెప్పుకోవాలి. అందుకు మనం అవకాశం కల్పించాలి. అంతే!''అన్నాడు.

ఆ తర్వాత భద్రుడు, మామగారికి విధంగా కబురుపంపాడు:''పెళ్ళికి ముందు పెళ్ళిచూపులకు వెళ్ళడం మన సంప్రదాయం. అందుకుగాను మీరు మా ఇంటికి రావలసి వుంటుంది. అయినవాళ్ళ మధ్య పెళ్ళిచూపు లేమిటని నలుగురూ నవ్వ

తారు. కాబట్టి ఈ పెళ్ళిచూపులు ఎవరికీ తెలియకుండా జరగాలి. ఏదైనా పనిచెప్పి ఉదయనుణ్ణి మా ఇంటికి పంపండి. వాడి వెంట మీరెవ్వరూ రాకండి. పెళ్ళిచూపులు జరుగుతాయి. జరిగినట్లు ఎవరికీ అనిపించదు.''

కబురందగానే తండ్రి ఉదయనుణ్ణి పిలిచి, ''ఘనాపురం నేతచీరలకు ప్రసిద్ధి. నగరంలో ఆ చీరలకు మంచి గిరాకీ వుంది. నువ్వు అక్కడికి వెళ్ళి వివరాలు తెలుసుకుని రా! ఈ విషయంలో నీకు బావగారు సాయపడతాడు,'' అని చెప్పాడు.

ఉదయనుడు ఆ పగలల్లా పనులు చూసుకుని చీకటిపడగానే భోజనం చేసి, సొంతగుర్రబ్బండిమీదప్రయాణమయ్యాడు. కొద్ది సేపట్లోనే అతడికి బాగానిద్ర పట్టి, బండి ఘనాపురంలో భద్రుడింటి ముందు ఆగగానే మెలుకువ వచ్చింది.

అప్పుడే తెలవారుతున్నది. ఆసమయంలో ఇంటి ముందు అరుణ ముగ్గులు పెడుతున్నది. పక్కన నిలబడి పంకజం కూతుర్ని మెచ్చుకుంటున్నది. బండిదిగినఉదయనుణ్ణి చూసి, అరుణ ఎవరోగుర్తుపట్టి ంది. అంతే వేస్తున్న ముగ్గునాపి లేచిఇంటి లోపలికి పరిగెత్తింది.

తనవంక ఒకే ఒక్క క్షణం చూసిన అరుణను చూసి ఆశ్చర్యపడి, ''ఎంత అందమో!'' అనుకున్నాడుఉదయనుడు. మాటరాక అలాగే నిలబడి పోయాడు. పంకజం, తమ్ముడి కేసి ఒక అడుగు వేసి,



''ఎవరో కొత్త మనిషిని చూసినట్టు అలాగే నిలబడి పోయావేమిటీ? అది మన అరుణ! దాన్ని నువ్వు చూసి అయిదేళ్ళయి పోయిందిగా. ఈ అయిదేళ్ళలోనూ అది బాగామారిందిలే. పద, ముందు లోపలికి!'' అన్నది.

ఇంట్లో అడుగుపెట్టగానే భద్రుడి గొంతు వినిపించింది. ఆయన కాస్త చిరాగ్గా, ''ఊ, మామయ్యొస్తే ఏమిటీ! వచ్చినవాడు వెళ్ళిపోడుకదా. ఈమాత్రం కబురుకు బంగారంలాంటి, నానిద్ర పాడు చెయ్యాలా? వెళ్ళు, వస్తున్నాను,'' అంటున్నాడు.

ఇది వింటూ ఉదయనుడు చిన్నబుచ్చుకున్నాడు. రాకరాకబావగారింటికివస్తే, ఆయన తనను చూడ్డానికి ఉత్సాహం చూపించకుండా, నిద్రలేపిన అరుణను కోప్పడుతున్నాడు.



అరుణ తనతో మాట్లాడ్డానికి రాగానే ఉదయనుడీ ప్రపంచం మర్చిపోయాడు. ఆమె తన ఊళ్ళో నేసే నేతచీరలను పొగుడుతూంటే, ఉదయనుడామె కట్టిన బట్టలను మెచ్చుకున్నాడు. అక్కడి చీరల అందాన్ని అరుణ వివరిస్తుంటే, అతడామె అందాన్ని పొగిడాడు. అతడు తను చెప్పేది సరిగా వినకుండా, తననే చూస్తున్నాడని గ్రహించిన అరుణ సిగ్గుపడింది.

ఆ రాత్రి ఇంటిడాబా మీద పడుకున్న ఉదయనుణ్ణి తెల్లవారుతూండగా వచ్చి నిద్ర లేపింది అరుణ. అంతలో కింది నుంచి ఎవరిదో పిలుపు వినబడింది. వచ్చినవాడు ఆ ఊరి పెద్ద రైతు వీరాస్వామి పాలేరు గంగన్న. ఉన్న పళంగా ఏదో పనిపడి ఆయన భద్రుడి కోసం కబురుపంపాడు.

''నాన్నింకా నిద్రలేవలేదు, గంగన్నా! వెళ్ళిలేపు,'' అన్నది అరుణ.

కొద్ది క్షణాల్లోనే భద్రుడి గొంతు వినబడింది. తనకు నిద్రాభంగం చేసినందుకాయన, గంగన్నపై విరుచుకుపడి నానా మాటలూ అన్నాడు. తర్వాత లేచి కొంతసేపటికి ఎంతో ఓర్పుగా కాచుకున్న గంగన్న వెంట వెళ్ళాడు.

"మీ బావ సలహా లేనిదే ఊళ్ళో వాళ్ళెవరూ ఏపనీ మొదలుపెట్టరు. ఆయనంటే అందరికీ చెప్ప లేనంత గౌరవం,'' అన్నది పంకజం తమ్ముడితో గర్వంగా.

ఆరోజు కూడా ఉదయనుడు ఊళ్ళో నేతచీరలు చూడలేదు. అరుణ అతడిని

కాసేపటికి భద్రుడువచ్చి, ఉదయనుణ్ణి కుశల ప్రశ్నలు వేశాడు. అతడు వచ్చినపని తెలుసుకుని, ''అరుణవన్నీ నా పోలికలు. కోపంలోనే కాదు, బుద్ధుల్లో కూడా! చాలా చురుకైనది. ఈ ఊళ్ళో చీరలు నేసే ఇళ్ళు నలభైదాకా వున్నాయి. అవన్నీ నీకు అరుణ చూపిస్తుంది. ఊళ్ళో దానికి తెలియంది లేదు,'' అన్నాడాయన.

స్నానం ఫలహారాలయ్యాక, ఉదయనుడికి అక్కకొడుకులిద్దరితో మంచి కాలక్షేపమయింది. వాళ్ళు ఉదయనుణ్ణి ఓపట్టాన విడిచి పెట్టేలాలేరని గ్రహించిన భద్రుడు, పిల్లలకు ఏవో పనులు పురమాయించి, నేత చీరల విషయంలో ఉదయనుడికి సాయపడమని అరుణకు చెప్పాడు.

వెంటబెట్టుకుపోయి, ఊరి పొలిమేరల్లో శిథిలమై పోతున్న కొన్ని జమీందార్ల కట్టడాలను చూపించింది. కొండదాపులనున్న గుడికి వెళ్ళారు.

వాళ్ళు తిరిగి వచ్చాక పంకజం, తమ్ముణ్ణి చాటుగా పిలిచి, ''అరుణ నీకు నచ్చిందిరా?'' అని అడిగింది.

ఉదయనుడికి అరుణ నచ్చింది కానీ ఆ మాట చెప్పడానికి తటపటాయించాడు. అరుణదంతా తండ్రిపోలికే అంటున్నారు. ఆయనేమో- మహా అహంకారిలావున్నాడు. ఆ పోలికే అరుణకు వస్తే సమస్య కదా! పంకజం తమ్ముణ్ణి బదులు చెప్పమని నొక్కించలేదు. ఆమె కూతుర్ని కూడా చాటుగా పిలిచి, ''మామయ్య నీకు నచ్చాడా?'' అని అడిగింది.

అరుణకు, ఉదయనుడు నచ్చాడు కానీ అయిదేళ్ళ క్రితం కలిగిన కోపం, దురభిప్రాయం ఇంకా తొలగి పోలేదామెలో. అందుకని తల్లికి బదులివ్వలేదు.

ఆ రాత్రి భోజనాలయ్యాక అంతా కబుర్లు చెప్పుకుంటుండగా, బసవయ్య అనే వాడొచ్చి భద్రుడితో, ''అయ్యా, పొలంలో బావి తవ్వించబోతున్నాను. తెల్లవారు ఝాములో ముహూర్తముంది. తమరు తప్పక రావాలి,'' అన్నాడు.

''నేను రావడం కుదరదు,'' అన్నాడు భద్రుడు.

''తమరెప్పుడు వీలో చెప్పండి. అప్పటికే ముహూర్తం పెట్టించుకుంటాను. తమరు




లేకుండా మాత్రం పని ప్రారంభిం చను. తమది చల్లటి మనసు. తలపెట్టినపని జయమవ్వాలంటే,తమరు పక్కనుండాలి,'' అన్నాడు బసవయ్య.

''అయితే, నన్ను నిద్రలేపడానికి రేపు తెల్లవారుఝామున ఎవర్నయినా పంపు!'' అన్నాడు భద్రుడు.

''ఎవరో ఎందుకు? నేనే స్వయంగా వచ్చి, తమర్ని వెంటబెట్టుకుని వెళతాను. తమరు వస్తానన్నారు, అదే భాగ్యం!'' అని బసవయ్య వెళ్ళిపోయాడు.

ఇది చూసి ఉదయనుడు చటుక్కున, ''బావా! తెల్లవారు ఝామున నిద్ర లేపితే, నీకు ఎక్కడ లేని చిరాకు వచ్చి విరుచుకు పడతావు కదా! ఈ బసవయ్యను మళ్ళీ

తెల్లవారు ఝామునే రమ్మన్నావెందుకు? ఏదో వంక పెట్టి తప్పించు కోవచ్చు కదా! ఏ మధ్యాహ్నం ముహూర్తమో పెట్టించవచ్చు," అన్నాడు

భద్రుడు పెద్దగా నవ్వి, "తెల్లవారి నిద్ర లేస్తూనే, ఎవరి మీదో ఒకరి మీద విరుచుకు పడకపోతే, నాకా రోజంతా సంతృప్తి వుండదు. అస్తమానూ ఒక్కరిమీదే విరుచుకుపడితే, సహించరు కదా! అందుకని నేనే మనుషుల్ని మార్చి ఏర్పాటు చేసుకుంటూంటాను. ఈ సారికి బసవయ్య వచ్చాడు. మంచిదే కదా, వాడిమనసుకు తృప్తి! నా పనీఅయిపోతుంది," అన్నాడు.

ఇది విని ఉదయను డాశ్చర్యపోయి, "బావా! ఆ చిరాకు, నీ దినచర్యల్లో ఒక భాగ మని నువ్వు ఇంత చెప్పిన తరవాత నాకు అర్థమయింది. లోగడ నీ చిరాకును వ్యక్తులపట్ల చిరాకుగా అపార్థం చేసు కున్నాను," అన్నాడు.

"అలాగా!" అని భద్రుడు ఒక క్షణం ఆగి, "ప్రతి మనిషిలోనూ కొన్ని లోపా లుంటాయి. మనిషిని దూరం నుంచి చూస్తే, ఆ లోపాలు దుష్ప్రవర్తనలా కనబడతాయి. దగ్గర్నుంచి చూసి అర్థం చేసుకుంటే ప్రతి మనిషీ మంచివాడే! అందుకే ఈ ఊళ్ళో, ఎంత చిన్నపని ఉన్న వాళ్ళయినా సరే, తెల్లవారు ఝామున నన్ను నిద్రలేపడానికి ఒక్కరూ కించపడరు," అన్నాడు.

తన తండ్రి చిరాకు, తనకు అలవాటై పోవడం వల్ల అది లోపంగా కనబడ్డం లేదనీ, ఉదయనుడి విసుగు తండ్రి చిరాకుతో పోల్చితే ఏమాత్రం బాధపడ తగ్గది కాదనీ అప్పటికి, అరుణకు కూడా బాగా అర్థ మయింది.

ఆరాత్రి అరుణ, ఉదయనుడు విడి విడిగా పంకజంతో - ఆమె అడక్కుండానే, తాము ఒకరంటే ఒకరు ఇష్టపడుతున్నామని చెప్పారు.



53. యుద్ధానికి ముందు

# మహాభారతం

మర్నాడు యుద్ధం ప్రారంభమవుతుందనగా ఆ రాత్రి దుర్యోధనుడు తన సేనలోని ప్రముఖ యోధులను, "మీరు పాండవ సేనను నిర్మూలించటానికి ఎంత కాలం పట్టుతుంది?" అనిఅడిగాడు.

తనకు ముప్ఫైరోజులు పట్టుతుందని భీష్ముడు చెప్పాడు. ద్రోణుడు తాను వృద్ధుడూ, బలహీనుడూ అయ్యాడు కనక తనకు కూడా ముప్ఫై రోజులు పట్టుతుందన్నాడు. కృపుడు తనకు రెండు మాసాలు పట్టుతుందన్నాడు. అశ్వత్థామ తనకు పదిరోజులు పట్టుతుందన్నాడు. కర్ణుడు తనకు అయిదు రోజులు చాలునన్నాడు. అది విని భీష్ముడు నవ్వి, "కృష్ణుడి సహాయంతో అర్జునుడు ఎదురు పడనంత కాలమూ నువ్వు ఇలాగే ప్రగల్భాలు పలికి, ఇంతకన్నా కూడా గొప్పలు చెప్పు కుంటావు," అన్నాడు.

ఈ సంగతి చారుల ద్వారా విని ధర్మరాజు అర్జునుడికి ఆ మాట చెప్పి, "నువ్వు కౌరవ సేనను ఎంతకాలంలో నిర్మూలించగలవు?" అని అడిగాడు.

దానికి అర్జునుడు, "నీ కెందుకు విచారం? మన యోధులు కౌరవ సేనను నిస్సంశయంగా నిర్మూలించగలరు. నన్నడిగితే, మూడు లోకాలూ ఎత్తివచ్చినా ఒక్క క్షణంలో జయించగలనంటాను. ఎందుకంటే, నా దగ్గిరపాశుపతాస్త్రం ఉన్నది. అది భీష్మ, ద్రోణ, కృప, కర్ణుల వద్దలేదు. కాని అలాంటి అస్త్రంతో అందరినీ చంపరాదు," అన్నాడు.





మర్నాడు తెల్లవారగానే కౌరవసేనలు పాండవసేనల కేసి నడిచాయి. దుర్యోధనుడి పక్షాన వున్న రాజులలో పరస్పరాభిమానమూ, విజయకాంక్షా కనిపించాయి.

కురుక్షేత్రం మధ్యలో దుర్యోధనుడు శిబిరం నిర్మించి, దాన్ని మరొక హస్తినాపురం లాగా తయారు చేయించాడు. అది నగరంలా గున్నది గాని శిబిరం లాగాలేదు. అదే విధంగా పాండవసేనలు కూడా యుద్ధభూమికి కదిలి వచ్చాయి. ఉభయపక్షాల సేనలూ రెండు మహా సముద్రాల లాగా కురు క్షేత్రంలో కూడేసరికి, మిగిలిన ప్రపంచంలో పిల్లలూ, స్త్రీలూ, ముసలివాళ్ళూ మాత్రమే మిగిలారు.

యుద్ధం ప్రారంభం కాబోతూ ఉండగా వ్యాసుడు ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "నీ కొడుకులకూ, మిగిలిన రాజులకూ కాలం మూడింది. నువ్వు వారికోసం దుఃఖించటం అనవసరం. నువ్వు యుద్ధాన్ని చూడ గోరి నట్టయితే నీకు దివ్యదృష్టి ఇస్తాను. దాని సహాయంతో నువ్వు యుద్ధరంగంలో ఏమేమి జరుగుతున్నదీ అప్పటికప్పుడే చూడగలుగు తావు," అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "మహర్షీ, జ్ఞాతుల చావు కళ్ళారా ఎలా చూసేది? యుద్ధం గురించి వివరాలు వింటాను. అందుకు ఏదైనా పద్ధతి ఉంటే చెప్పు," అన్నాడు.

అప్పుడు వ్యాసుడు, "యుద్ధరంగమంతా రాత్రిం బగళ్ళు ఈ సంజయుడి కళ్ల ముందు కనబడేటట్టు చేస్తాను. అతను నీకు యుద్ధ క్రమమంతా చెబుతాడు," అన్నాడు

అదేవిధంగా సంజయుడు యుద్ధ వార్త లనుధృతరాష్ట్రుడికి యధాతథంగా తెలుపుతూ వచ్చాడు.

యుద్ధారంభానికి ముందు కౌరవసేనకు సర్వసేనాని అయిన భీష్ముడు యుద్ధం చేయ బోతున్న రాజులతో, "రాజులారా, మీ కందరికీ స్వర్గ ద్వారాలు తెరిచి ఉన్నాయి. ఆ ద్వారం కుండా ఇంద్రలోకానికీ, బ్రహ్మలోకానికీ వెళ్ళండి. క్షత్రియులకు ఇదే సరిఅయిన మార్గం నిర్భయంగా పోరాడండి. క్షత్రియుడు వ్యాధిగ్రస్తుడై, మంచాన పడి చావరాదు," అన్నాడు.

భీష్ముడు రణరంగంలో నిలిచి ఉండగా యుద్ధరంగంలోకి అడుగుపెట్టనని ప్రతిజ్ఞ చేసిన కర్ణుడు తప్ప, మిగిలిన రాజులంతా యుద్ధఘోషతో కదిలారు.

ఉభయ సైన్యాలూ వ్యూహంలో తీర్చిదిద్ద బడ్డాయి. పాండవసేనకు భీముడు ముందు నడిచాడు. శిఖండి సైన్యం వ్యూహ మధ్యంలో

ఉన్నది. కుడిపార్శ్వాన్ని సాత్యకి రక్షిస్తున్నాడు. ధృష్టద్యుమ్నుడు వ్యూహ మంతటా సంచరిస్తున్నాడు. కృష్ణుడు సారథిగా రథం మీద కూర్చున్న అర్జునుడు రెండుసేనల మధ్య తన రథాన్ని నిలపమని కృష్ణుణ్ణి కోరాడు. కృష్ణుడు అలాగే చేసి, ''అర్జునా, భీష్మ ద్రోణులు మొదలుగా గల కౌరవ వీరులను చూడు,'' అన్నాడు.



అర్జునుడికి తన ఎదట కనిపించినవారు అతనికి తండ్రులూ, తాతలూ, గురువులూ, మేనమామలూ, సోదరులూ, మనమలూ అయిన బంధుజనం. యుద్ధంలో వారినందరినీ చంపాలనే సరికి అతనికి కంపరం పట్టుకున్నది. చేతి నుంచి గాండీవం మెల్లగా జారిపోతున్నట్టయింది.

అతను, కృష్ణుడితో, ''యుద్ధంలో ఈ బంధువులను చంపటంలో గల మేలేదీ నాకు కనబడదు. నాకు రాజ్యం వద్దు, సుఖాలు వద్దు,'' అంటూ దుఃఖంతో రథంలో కూలబడ్డాడు.

అదిచూసి కృష్ణుడు, ''అర్జునా, నీ కిదేం మనోజాడ్యం! ఇది స్వర్గానికి దారితీయదు, అపకీర్తి తెస్తుంది! వీరుడవైన నీ కిది తగదు. చావుబతుకులను గురించి బుద్ధిమంతులు శోకించరు. ఆత్మకు ఒక దేహం శాశ్వతం కాదు. దానికి దేహాలు వస్తాయి, పోతాయి. ఆత్మ చచ్చేదీ కాదు, చంపేదీ కాదు. అది చినిగిన బట్టలు వదిలేసి కొత్త బట్టలు వేసుకున్నట్టుగా జీర్ణమైన దేహాలను విడిచి, కొత్త దేహాలను ధరిస్తుంది. అందుచేత నువ్వు యుద్ధానికి సిద్ధపడు. క్షత్రియుడికి యుద్ధం చెయ్యటం ఉత్తమ ధర్మం. యుద్ధం మాని కీర్తికీ, స్వర్గానికీ దూరం కాకు. అపకీర్తి కన్న మరణం మేలు. యుద్ధంలో గెలిచావా భోగాలు అనుభవిస్తావు, చచ్చావా స్వర్గసుఖాలు అనుభవిస్తావు. సుఖదుఃఖాలనూ, లాభాలాభాలనూ, జయాపజయాలనూ సమానంగా చూడటం బుద్ధిమంతుల లక్షణం,'' అంటూ అర్జునుడికి హితబోధ చేశాడు.

కృష్ణుడి బోధల వల్ల అర్జునుడి మనసు మారింది. అతని సంశయాలన్నీ తొలగిపోయాయి.

ఇంతలో ధర్మరాజు తన కవచం విప్పి, తన ఆయుధాన్ని ఒక పక్కన పెట్టి, రథంనుంచి దిగి, చేతులు జోడించుకుని కాలినడకన భీష్ముడి కేసి బయలుదేరాడు. అది చూసి అర్జునుడూ, మిగిలిన పాండవులూ రథాలు దిగి, ధర్మరాజు వెనకగా బయలుదేరారు. అందరి వెనకగా కృష్ణుడుకూడా వెళ్ళాడు.



అర్జునుడు ధర్మరాజును, ''రాజా, మమ్మల్ని విడిచిపెట్టి, ఇలా ఒంటరిగా శత్రుసేన కేసి వెళ్ళుతున్నా వెందుకు?'' అని అడిగాడు.

భీమ, నకుల, సహదేవులు కూడా ధర్మ రాజును అదే ప్రశ్న వేశారు. వాళ్ళ ప్రశ్నలు విని కూడా జవాబు చెప్పకుండా ధర్మరాజు ముందుకు సాగాడు. కృష్ణుడు నవ్వుతూ వారితో, ''ఆయన ముందుగా భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ అనుమతి కోరి, తర్వాత యుద్ధం ప్రారంభిస్తాడు. అలా పెద్దల అనుమతితో యుద్ధం చేస్తే విజయం లభి స్తుంది,'' అన్నాడు.

ఈ లోపుగా కౌరవసేనలో రకరకాల మాటలు పుట్టాయి.

''ఛీ, ఛీ! ఈ ధర్మరాజు క్షత్రియకులం చెడ బుట్టాడు! యుద్ధం చెయ్యటానికి భయపడి, తన తమ్ములతో సహా భీష్మణ్ణి శరణువేడ వస్తున్నాడు. అటువంటి తమ్ములుండగా ఇతను భయపడటం ఎంత సిగ్గుచేటు! తీరా యుద్ధం చెయ్యవలసి వచ్చేసరికి గుండె జారిపోయి ఉంటుంది,'' అనుకున్నారు కౌరవ యోధులు. వాళ్ళకు దుర్యోధనుడి పక్షం మీద బాగా గౌరవం పెరిగింది.

రెండు సేనలలో వాళ్ళూ, భీష్ముడితో ధర్మ రాజు ఏమంటాడో, భీష్ముడు ఏం సమాధానం చెబుతాడో, యుద్ధ మంటే ఒళ్ళు పొంగే భీముడు ఏమంటాడో, కృష్ణార్జునులు ఏం మాట్లాడతారో వినాలని ఎంతో ఆసక్తిగా ఉన్నారు.

ధర్మరాజు తన తమ్ములతో భయంకరమైన శత్రుసైన్యంలోకి జొరబడి, అతివేగంగా భీష్మణ్ణి సమీపించి, ఆయన పాదాల మీద పడి, ''తాతా, యుద్ధంలో ఎవరూ ఎదుర్కో లేని నీతో యుద్ధం చెయ్యటానికి నీ అనుమతి కోసం వచ్చాం. నువ్వు మాకు నీ అనుమతి ఇచ్చి, ఆశీర్వదించు,'' అన్నాడు.

దానికి భీష్ముడు, ''నువ్వు ఇలా వచ్చి నందుకు నాకు చాలా సంతోషమయింది. యుద్ధం చెయ్యి గెలుస్తావు. నానుంచి ఏ వరం కావాలన్నా కోరుకో. అందువల్ల నీకు అప జయం కలగదు. ధనం మనిషిని దాసుణ్ణి చేస్తుంది. అందుచేత నేను కౌరవుల పక్షాన పోరాడ వలసి వచ్చింది. నువ్వు దానికి భంగం లేకుండా ఏ వరమైనా కోర వచ్చు,'' అన్నాడు.

''ఓటమి ఎరగని నిన్ను ఈ యుద్ధంలో మేము ఓడించే ఉపాయం ఏది? మాశ్రేయస్సు కోరిన వాడైతే చెప్పు,'' అన్నాడు ధర్మరాజు.



ఉంటే చెప్పు. యుద్ధసహాయం తప్ప మరేదైనా చేస్తాను. కౌరవుల ఉప్పు తిన్నందున వారికోసం యుద్ధం చెయ్యక తప్పదు,'' అన్నాడు.

''మీరు కౌరవుల తరఫునే యుద్ధం చెయ్యండి. నాకు మీ విజయాశీర్వాదంచాలు,'' అన్నాడు ధర్మరాజు.

''నీకు కృష్ణుడు తోడుండగా విజయానికేమిలోటు? తప్పక జయిస్తావు,'' అన్నాడు ద్రోణుడు.

''నిన్ను ఓడించటం ఎవరికీ సాధ్యం కాదు. అలాంటి నిన్ను మేము ఎలా ఓడించగలమో చెప్పు,''అని ధర్మరాజు ద్రోణుణ్ణి అడిగాడు.

''నేను యుద్ధం చేస్తున్నంత కాలమూ నీకు విజయం కలగదు. అందుచేత, నువ్వూ నీ తమ్ములూ సాధ్యమైనంత త్వరగా నన్ను చంపెయ్యండి,'' అన్నాడు ద్రోణుడు.

''అందుకే నిన్ను అడిగాను. నిన్ను చంపే ఉపాయ మేది?'' అని ధర్మరాజు మళ్ళీ అడిగాడు.

''నేను అస్త్రం పట్టి ఉండగా నన్నెవడూ చంపలేడు. కాని అప్రియం ఏదైనా నా చెవుల బడితే, అది కూడా నమ్మదగిన వాడు చెబితే, అస్త్ర సన్యాసం చేస్తాను,''అన్నాడు ద్రోణుడు.

తర్వాత ధర్మరాజు కృపుడి వద్దకు వెళ్ళి, ''గురువర్యా, మీ అనుమతితో యుద్ధం ప్రారంభించి విజయం పొందగోరి వచ్చాను,'' అన్నాడు.

కృపుడు కూడా సంతోషించి, భీష్మ ద్రోణులు చెప్పినట్టే యుద్ధ సహాయం తప్ప మరేదైనా కోరుకోమని అన్నాడు. ''నువ్వు ఎలా చస్తావు?''అని అడగటానికి బిడియపడి ధర్మ రాజు దీనంగా నిలబడ్డాడు. దానిని చూసి

''అదే నాకు తెలియదు. యుద్ధంలో నన్నెవడూ జయించలేడు. నాకు యుద్ధంలో చావు కూడా లేదు. మరొకసారి రా,''అన్నాడు భీష్ముడు.

ధర్మరాజు భీష్ముడికి నమస్కారం చేసి, ద్రోణుడి రథం వద్దకు తమ్ములతో సహా వెళ్ళి, ద్రోణుడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, ''బ్రాహ్మణోత్తమా, యుద్ధం చెయ్యటానికి నీ అనుమతి కోరి వచ్చాను. నీ ఆజ్ఞ లేకుండా నేను శత్రువులను ఎలా జయించగలను?'' అన్నాడు.

దానికి ద్రోణుడు, ''రాజా, నువ్వు యుద్ధం తలపెట్టగానే ముందుగా నన్ను వచ్చి చూశావు కావెందుకు? అందుకు గాను నీకు అప జయం కలిగేటట్టు శపించి ఉండవలసినదే. కాని ఇలా వచ్చావు గనక నేను సంతోషించాను. యుద్ధం చెయ్యి, గెలుస్తావు. నీ కేదైనా కోరిక

కృపుడు, ''నన్ను ఎవరూ చంపలేరు. వెళ్ళి యుద్ధం చెయ్యి. నీకు జయం కలగాలని ఆశీర్వదిస్తున్నాను,'' అన్నాడు.

ధర్మరాజు కృపుడి వద్ద శలవు పుచ్చుకుని శల్యుడివద్దకువెళ్ళి, ''మామా,యుద్ధం చెయ్యటానికి అనుజ్ఞ ఇయ్యి. నీ అనుమతితో శత్రువులను జయిస్తాను,'' అన్నాడు.

శల్యుడు కూడా తన అనుమతి ఇచ్చి, ధర్మరాజుకు జయం కలగాలని ఆశీర్వదించి, యుద్ధంలో సహాయం తప్ప ఇంకేదైనా కోరమన్నాడు.

అప్పుడు ధర్మరాజు, ''మహారాజా, యుద్ధ ప్రయత్నాల సమయంలో కర్ణుడి వధకు తోడ్పడమని కోరాను. అదే నేనిప్పుడు మళ్ళీ కోరుతున్నాను,'' అన్నాడు.

''ధర్మరాజా! తప్పక సహాయం చేస్తాను. నీకు యుద్ధంలో జయం కలుగుతుందని శపథం చేస్తున్నాను. వెళ్ళి యుద్ధం చెయ్యి,'' అన్నాడు శల్యుడు.

ధర్మరాజు తన తమ్ములతో సహా కౌరవసేన నుంచి వెళ్ళిపోయాడు. కృష్ణుడు కర్ణుడి వద్దకు వెళ్ళి, ''కర్ణా, నువ్వు భీష్ముడు యుద్ధ రంగంలో ఉన్నంత కాలమూ దుర్యోధనుడి పక్షాన యుద్ధం చెయ్యవుగదా, అంతదాకా పాండవుల పక్షాన యుద్ధం చెయ్యగూడదా? భీష్ముడు పడిపోయినాక కౌరవపక్షాన యుద్ధం చెయ్యవచ్చు,'' అన్నాడు.

''నేను దుర్యోధనుడి కోసం ప్రాణాలైనా ఇస్తాను గాని, అతనికి ఎన్నడూ అపకారం చెయ్యను,'' అన్నాడు కర్ణుడు.

కౌరవసేననుంచి బయటికి వచ్చిన ధర్మరాజు రెండు సేనల మధ్య నిలబడి కౌరవసేన కేసి తిరిగి, ''మీలో ఎవరైనా మాకు సహాయం చెయ్య గోరితే మా పక్షానికి రండి,'' అని అడిగాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన యుయుత్సుడు ధర్మరాజు పట్ల అభిమానం కలవాడై, ''నువ్వుకోరితే నేను నీ పక్షానికి వచ్చి కౌరవులతో యుద్ధం చేస్తాను,'' అన్నాడు.

అందుకు ధర్మరాజు సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆయన తన స్థానానికి తిరిగి వచ్చి కవచం ధరించాడు. అందరూ తమతమ రథాలు ఎక్కారు. యోధులందరూ శంఖాలు పూరించారు. భేరులు మోగాయి. యుద్ధం ఆరంభమయింది.





# నిజమైన పండితుడు

చక్రధరపురంలో చక్రి అనే బ్రాహ్మణ యువకుడుండేవాడు. వాడికి నా అనే వాళ్ళెవరూ లేరు. చిన్నతనంలోనే తల్లితండ్రులు పోవడంచేత, వాడు ఆ పంచా ఈ పంచా గడిపేస్తూ, వాళ్ళూ వీళ్ళూ పెట్టింది తిని, యవ్వనంలోకి అడుగు పెట్టాడు. ఇప్పుడు వాడు ఇంటింటికీ తిరుగుతూ, పంచాంగంలోని తిథి, వారం, నక్షత్రం చెబుతూ, యాయవారంచేస్తున్నాడు. అందులో వచ్చినబియ్యాన్ని వాడు, పచారీ కొట్టులో అమ్మేసి, కొట్టువాడిచ్చిన డబ్బులతో, పూట కూళ్ళ ఇంట్లోభోజనం చేస్తూ, కొంత సొమ్ము వెనకేసుకున్నాడు.

చిన్నతనం నుంచీ చక్రికి కవిత్వం మీద ఆసక్తి వుండేది. వాడు ఒకరిద్దరు పండితుల దగ్గర శిష్యరికం చేసి, పద్యాలల్లడం నేర్చుకున్నాడు. వాడు చక్రధర పురంలోని సత్రం అరుగు మీదపడుకుని, తను అల్లినపద్యాలు రాగయుక్తంగా పాడేవాడు.

ఒకనాడు, ఆ సత్రం గదిలో, బాటసారిగా ఎక్కడికో వెళుతూ, ఒక కవి బసచేయడం జరిగింది. ఆ కవి, చక్రి పాడే పద్యాలను శ్రద్ధగా విని, వాడితో, “నాయనా! గాయకుని గానము, కవి చెప్పే కవిత్వము, ఆశ్రయం లేకపోతే చిల్లి గవ్వ విలువచేయవు. చూడబోతే నీదగ్గర మంచి ధారణాశక్తి వుంది. ఏరాజునైనా ఆశ్రయించు. భుక్తి లభించడమే కాక, చిరస్థాయిగా వుండే కావ్యాన్ని రాయగలవు!” అని మెచ్చుకున్నాడు.

కవిమాటలు చక్రికి ఉత్సాహాన్ని కలిగించాయి. వాడు రాజధానికి పోయి, రాజునాశ్రయించాలని నిర్ణయించుకున్నాడు. ఉన్నపళంగా రాజధానికి ప్రయాణం కట్టాడు. యాయవారంలో సంపాయించి వెనకేసుకున్న డబ్బుతో, పూటకూళ్ళ ఇంట్లో భోజనం చేస్తూ ప్రయాణం సాగించి, కొంతకాలానికి రాజధానికి దగ్గరగా వున్న ఒక గ్రామం చేరుకున్నాడు. ఆ సరికి కనుచీకటి పడుతున్నది.

చక్రి పూటకూళ్ళ ఇల్లుఎక్కడున్నదో తెలుసుకుందామని బయలుదేరాడు. దారిలో ఒక రావి చెట్టుకింద రచ్చబండ మీద కూర్చుని

డా . జొన్నలగడ్డ మార్కండేయులు

వున్న నడి వయస్సు బ్రాహ్మడు, వాడిని పలక రించి, పూటకూళ్ళ ఇంటి సంగతితో పాటు, వాడు రాజధానికి బయలుదేరిన విషయం కూడా అడిగి తెలుసుకున్నాడు.

తర్వాత,ఆయన చక్రితో, "నేను కూడా బ్రాహ్మణుడినే! సాటి బ్రహ్మణుణ్ణి పూట కూళ్ళింటికి ఎలా పంపుతాను. మా ఇంటికి రా. పైగా నువ్వు కవివి కూడా. నిన్ను రాజ ధానికి పంపేఏర్పాటు నేనే చేస్తాను," అన్నాడు.

చక్రి సంతోషించి, ఆయన వెంట వాళ్ళిం టికి వెళ్ళాడు. వాకిట్లో బ్రాహ్మణుడి తండ్రి వున్నాడు.ఆయన బాగా వయసు పైబడిన వాడు. చక్రి పుట్టుపూర్వోత్తరాలు అడిగి తెలుసు కుని, వాడితో తమ వంశానికి బీర కాయ పీచు సంబంధం వున్నదని గ్రహించి, చక్రితో, "నాయనా! నువ్వు నాకు చుట్టానివవుతావు. ఈఉళ్ళోనే వుండి పో.నాలుగిళ్ళు పౌరోహిత్యం ఇప్పిస్తాను.కొంత కాలూ చెయ్యీ కూడదీసు కున్నాక, రాజధానికివెళ్ళి కవివవుదువు గాని," అన్నాడు.

చక్రిఏదో సమాధానం చెప్పబోయేంతలో, ఆయన మనవరాలు స్వాతిఅక్కడికి వచ్చింది. ఆమె పెళ్ళీడులో వుంది.చక్రిని చూసి కాస్త సిగ్గుపడుతూ, "తాతా! వడ్డన పూర్తయింది. నాన్న మిమ్మల్ని రమ్మంటున్నాడు," అన్నది.

ముసలాయన ఆమెతో, "అమ్మా, స్వాతీ! ఇతని పేరు చక్రి; కవి," అన్నాడు.

స్వాతి నవ్వి, "నాన్న అంతా చెప్పాడు. రాజుగారి కొలువులో ఇప్పటికే ముగ్గురు కవు లున్నారు. ఒకరు పగలు, ఒకరు సాయం కాలం, ఇంకొకరు రాత్రివేళలలో మహాపండి తులు! మరి ఈయన ఏ కాలంలో, ఎందులో పండితుడట!" అన్నది.



ఆ మాటలకు చక్రి నవ్వి, "నేనింకా అన్ని కాలాలూ చూడవలసిన వాడిని. మీరు చెప్పిన ఆ ముగ్గురు కవి పండితులు మెచ్చు కుంటేనే, నేను ఈ కాలానికి కవినవుతాను!" అన్నాడు.

ఆదేశపు రాజుకు, పొరుగురాజుల భయంతో పాటు, దేశపౌరుల్లోనే కుట్రదారు లున్నారన్న అనుమానం కూడా వున్నది. ఆయన నియమించిన గూఢచారుల్లో ఒకడు, కాకతాళీయంగా, ఈ సంభాషణ వినడం తటస్థించింది. వాడికి ఈ సంభాషణ ఏమీ అర్థంకాక, వెంటనే వెళ్ళి అంతా. రాజుకు విన్నవించాడు.

రాజు, తన ఆస్థానంలోని ముగ్గురు కవులను పిలిపించి, చక్రిస్వాతిల మధ్య జరిగిన సంభాషణ గురించిచెప్పి, "ఇందులో నిగూఢ అంతరార్థాలేమైనా వున్నవా?" అని అడిగాడు.

కవులు ముగ్గురూ కోపంతో ఊగి పోతూ, ''మహారాజా! అల్పుల మాటల్లో అర్థాలే ముంటాయి! ఆ ఇద్దరూ మమ్ములను వ్యసనపరులని తిట్టారు. పగలు పండితుడంటే, జూదగాడు. సాయంకాలం పండితుడంటే, చోర కళా నిపుణుడు. రాత్రి పండితుడంటే, వేశ్యాలోలుడు,'' అన్నారు.

రాజు మర్నాడు చక్రికి, స్వాతికి కబురు చేసి, కొలువుకు రప్పించి, ''మీరు పండితులను వ్యసనపరులని అన్నారట! అది రుజువు చేయ లేక పోతే కఠినంగా శిక్షిస్తాను,'' అన్నాడు.

చక్రి, స్వాతి కొంచెంసేపు కూడ బలుక్కున్నాక, చక్రి వినయంగా పండితుల కేసి తిరిగి,'' ఓ,మహాపండితులారా! మీరు మీకున్న వ్యసనాలు బయటపెట్టుకున్నారేమో, నాకు తెలియదు! కాని,జూదమాడి అష్టకష్టాలు పడిన పాండవుల గాథ చెప్పేవాడు పగలు పండితుడు. సీతాపహ రణం గల రామాయణగాథ- చోర ప్రసంగం సాయంకాలం జరుగుతుంది కాబట్టి; సాయంత్రం పండితుడు; అంటే రామాయణ పండితుడు. ఇక రాత్రి వేళ పండితుడంటే రసికాలోలత్వము గల శ్రీకృష్ణుడి గాథ చెప్పే మహాభాగవత పండితుడని! అలాంటి గొప్ప గ్రంథాలలో మీలో ఒక్కొక్కరు ఒక్కొక్క దానిలో పండితులని. అలాంటి మీరు మెచ్చు కుంటేనే, నేను నిజమైన పండితుణ్ణవుతానని, మాఇద్దరి సంభాషణ సారాంశం!'' అన్నాడు.

చక్రి ఇలా చెప్పగానే పండితులు పరమానంద భరితులై ,''మేము అసూయాద్వేషాలతో తీసిన విపరీతార్థాలతోనే, మేము ఏఏ కావ్యాలలో పండితులమో లోకానికి చెప్పిన నువ్వే, నిజమైన పండితుడివి! నిన్ను మన సారా అభినందిస్తున్నాము!'' అన్నారు.

రాజు, చక్రిని ఘనంగా సన్మానించి తన కొలువులో చేర్చుకున్నాడు.

ఆ తర్వాత, నెల తిరక్కుండానే చక్రి, స్వాతిని పెళ్ళి చేసుకుని, కవిగా నాలుగు కాలాల పాటు నిలిచిపోయే కావ్యాలు రచించాడు.





# పొదుపు రహస్యం

పడమటి తీరాన గణేశుడూ, గంగాధరుడూ అని ఇద్దరు యువకులుండే వారు. వాళ్ళు ఒకే గ్రామంలో ఉండి, చిన్నతనం నుంచీ కలిసి తిరిగారు. వాళ్ళు యుక్త వయస్కులై తమ బతుకుతెరువు తాము చూసుకోవలసి వచ్చేసరికి వారుండే ప్రాంతం బొత్తిగా కాటక ప్రాంతమైపోయింది. అందుచేత వాళ్ళు ఆ ప్రాంతాన్ని వదిలి పెట్టి తూర్పుతీరానికి వెళ్ళి, సంపద సమృద్ధిగా ఉండేచోట జీవనోపాధి కలిగించు కుందామనుకున్నారు.

''మనిషి పొట్టకెంత కావాలి? ఇంత అన్నమూ, ఎండు చేపలూ తింటూ ఎంత కాలమైనా బతకవచ్చు. అలా పొదుపుగా జీవిస్తూ కష్టపడి సంపాదించిన దానిలో నుంచి సాధ్యమైనంత మిగుల్చుకున్నా మంటే, అది పెట్టుబడిగా ఏ వర్తకం చేసు కున్నా జీవితం సుఖంగా గడిచిపోతుంది,'' అన్నాడు గంగాధరుడు.

''అలాగే పొదుపుగాజీవించి జీవితంలో పైకివద్దాం,'' అన్నాడు గణేశుడు.

ఇద్దరూ ప్రయాణం చేసి తూర్పుతీర ప్రాంతం చేరుకున్నారు.అది సుక్షేత్రం. ఎక్కడ చూసినా ఏపుగా పెరిగిన పచ్చటి పైరులు కనిపించి, వారి కళ్ళను ఎంతో ఆనంద పరిచాయి.

స్నేహితులిద్దరూ ఒక నగరం చేరారు. అక్కడ వర్తకం కూడా బాగా సాగుతున్నది. నగరం చేరుతూనే స్నేహితులిద్దరూ చీలి పోయారు. ఒకటి, రెండేళ్ళ పాటు ఎవరి అదృష్టాన్ని వారే వెతుక్కోవటమూ, ఒకరి బరువు ఒకరిమీద వెయ్యకుండా ఉండ టమూ మంచిదని వారికి అనిపించింది.

గణేశుడు దొరికిన పని ఏదైనా చేసి, రోజు పొడుగునా శ్రమపడి డబ్బు సంపాదించ సాగాడు. గంగాధరుడు చెప్పినట్టే అతను వరి అన్నమూ, ఎండుచేపలూ తింటూ సాధ్యమై నంత తక్కువ ఖర్చుతో కాలక్షేపం చేస్తూ వచ్చాడు.

కాని గణేశుడు ఎంతోకాలం ఇలా చెయ్యలేకపోయాడు. ముఖ్యంగా అతనికి తిండి గురించి అసంతృప్తి ఏర్పడింది. దగ్గిర డబ్బు ఉండగా, నోరు కట్టేసుకోవడం అతనికి సాధ్యం కాలేదు. అందుచేత ఒకనాడు అతను కోడిని కొని, వండుకుని తిన్నాడు. దాంతో అతనికి ప్రాణంలేచి వచ్చినట్టయింది. సుఖంగా తినటానికి కాకపోతే ఎంతో శరీర




కష్టం చేసి డబ్బు సంపాదించినందుకు ఫలితం ఏమిటి?

అయినా, ఒకవంక తాను పొదుపు నియమాన్ని ఉల్లంఘించినందుకు మనస్సు బాధపడింది. అందుచేత అతను మళ్ళీ కొన్నాళ్ళు అన్నమూ, ఎండుచేపలూ తింటూ గడిపాడు. కాని అది భోజనం లాగానే లేదు.కోడి రుచి అనుక్షణమూ జ్ఞాపకం వచ్చేది.

చివరకు గణేశుడి జిహ్వాచాపల్యమే గెలిచింది. అతను తన దగ్గిర ఉన్నదంతా రుచిగా తినటానికే ఖర్చు చేయసాగాడు. తిండి సుఖంతో, మిగుల్చుకున్న డబ్బంతా అయిపోవటం అలా ఉంచి, అతనికి పనికి ఒళ్ళు వంగకుండా పోయింది. దీని ఫలితంగా అతను అన్నమూ, ఎండు చేపలూ కొనటానికి కూడా తగినంత సంపాదించుకోలేని స్థితికి వచ్చేశాడు.

ఈలోపల గంగాధరుడు పొదుపు నియమంతో బాగుపడ్డాడు. అతను ప్రతి రాగి దమ్మిడి కూడా ప్రాణంతో సమంగా ఎంచి, తన కష్టార్జితాన్ని కూడబెట్టి, చిన్న చిన్న వ్యాపారాలతో ప్రారంభించి, క్రమంగా పెద్ద వర్తకానికి ఎగబాకి, అందులో త్వరగా పైకి వచ్చి, కొంత ఆస్తి సంపాదించుకుని, ఇల్లు కట్టుకుని, పెళ్ళిచేసుకున్నాడు.

తనతో బాటే కట్టుబట్టలతో వచ్చిన గంగాధరుడు తానున్న నగరంలోనే ధనికుడుగా బతుకుతున్న సంగతి గణేశుడికి తెలుసు. అందుచేత తన మిత్రుడి సహాయం పొందుదామన్న ఉద్దేశ్యంతో అతను గంగాధరుడి ఇంటికి వెళ్ళి, తనకు అదృష్టం కలిసి రాలేదనీ, తనకు పూటకింత అన్నమూ, ఎండుచేపలూ కరువయ్యాయనీ చెప్పాడు.

"నీకా అన్నమూ, ఎండుచేపలూ అందేటట్టు నేను చూస్తాను. నువ్వు నీ కాళ్ళ మీద

నిలబడు,'' అని గంగాధరుడు గణేశుడికి తన ఇంటి ఆవరణలో ఒక గుడిసె వేయించి ఇచ్చి, రోజూ బియ్యమూ, ఎండుచేపలూ అతనికి పంపుతూ వచ్చాడు. గణేశుడు వాటితో వంటచేసుకు తింటూవచ్చాడు.

కొద్ది రోజులు గడిచాక గంగాధరుడు గణేశుణ్ణి పిలిపించి, ''రోజూ ఎండుచేపలు తినటం నీకు చవిచచ్చినట్టుగా ఉంటున్నదేమో! ఒక పనిచెయ్యి. నా చింత తోపులో కెల్లా చిన్న చింతమొక్కను నీకు ఇచ్చేస్తాను. దాని ఆకు తెచ్చి, చేపల కూరలో వేసి ఉడక బెట్టావంటే రుచిగా ఉంటుంది. ఆ పని చెయ్యి,'' అన్నాడు.

గణేశుడు తన మిత్రుడి చింతల తోపుకు వెళ్ళి, అక్కడ ఉన్న మొక్కలలో చిన్న దాని నుంచి ఆకు దూసుకువచ్చి చేపలకూరలో వేశాడు. కూరరుచిగానే ఉన్నది. అయితే కొద్ది రోజులకల్లా చింతమొక్కన ఒక్క ఆకు కూడా లేకుండా పోయింది.

గణేశుడు తన మిత్రుడి వద్దకు వెళ్ళి చిన్న మొక్కలో ఆకులు లేకుండా పోయాయని చెప్పి, మరొక చింతచెట్టు నుంచి ఆకు కోయ టానికి అనుమతికోరాడు.

''ఈ సారి ఉన్న చెట్లన్నిటిలోకీ పెద్ద చెట్టు నుంచి ఆకు కోసుకో,'' అన్నాడు గంగాధరుడు.

మళ్ళీ కొన్నాళ్ళు గడిచాయి. గంగాధరుడు గణేశుణ్ణి పిలిచి, ''నువ్వు, కోసుకునే చెట్టున చింతాకు అయిపోలేదు గద,'' అన్నాడు.

''నేను రోజుకు గుప్పెడు ఆకు కోస్తే ఆ చెట్టున మర్నాటికి రెండు గుప్పెళ్ళు చిగురు పెట్టుకొస్తుంది,'' అన్నాడు గణేశుడు.

''నువ్వు చేసిన దానికీ, నేను చేసినదానికీ అంతేతేడా! నువ్వు నీ ఆర్థికస్థితి చిన్న మొక్కగా ఉండగానే దాన్ని దోచావు. నేను పెద్ద చెట్టు అయ్యేదాకా ఓపిక పట్టి, దాని నుంచి నాకు కావలసినదంతా అనుభవించ గలుగు తున్నాను. నీ జీవితం మోడుబారి పోయింది. నా జీవితం మూడు పూలూ, ఆరు కాయలుగా ఉన్నది,'' అన్నాడు గంగాధరుడు.

''అవును! ఇక నేను నీమీద ఆధార పడక, మళ్ళీ జీవితం ప్రారంభిస్తాను,'' అని గణేశుడు తన స్నేహితుడు చెప్పిన నీతిని అమలుచేయటానికి పూనుకున్నాడు.



# రాజులకైనా వినయం ప్రధానం!

చిత్రాలు: శంకర్‌లీ



















రాజభవనం చేరేలోగా రాజులో గర్వం పెచ్చు పెరిగిపోయింది.
ఎక్కడో అడవిలో తపస్సు చేసుకునే మునికే తెలిసినప్పుడు, నా ధర్మ పరిపాలన,గురించి నా ప్రజలకు తెలియకుండా ఉంటుందా?


రాజు విందు ఏర్పాటు చేయాలనుకున్నాడు. వంటవాడికోసం కబురు పెట్టాడు.
"విందుభోజనం ఏర్పాటు చెయ్! అడవికాకర వేపుడు, వేపాకుపచ్చడి ముఖ్యంగా ఉండాలి..."
చిత్తం! మహాప్రభూ!


విందు ఏర్పాటయింది. పురప్రముఖులూ, రాజోద్యోగులూ వచ్చారు. రాజుగారుమొదట విందురుచి చూడాలని అందరూ కూర్చున్నారు. కాకరకూరను తీసి రాజునోట్లో వేసుకుని ముఖం చిట్లించాడు. వేపాకుపచ్చడి రుచి చూశాడు.
ఘోరం! మహా చేదుగా ఉంది!


రాజు తన బాధను కప్పి పుచ్చుకోవడానికి ప్రయత్నించాడు. వంటవాణ్ణి పిలిచి చెవిలో ఏదో చెప్పాడు.
"వీటన్నిటినీ తీసెయ్! మామూలు వంటకాలు వడ్డించు!"


అతిథులు వెళ్ళిపోయాక, రాజు అడవికి వెళ్ళి, మునిని దర్శించి విందును గురించి చెప్పాడు.
"మహాత్మా! ఇక్కడ కాకరకాయలూ, వేప ఆకులూ తియ్యగా వుండి, రాజభవనంలో చేదుగామారడానికి కారణం ఏమిటి"
"రాజా! నువ్వు ఇక్కడికి వచ్చినప్పుడు నీలో వినయగుణం ఉండేది.నీ ధర్మపాలన గురించిన నా పొగడ్తలు నీలో గర్వాన్ని పెంచాయి. వినయం నశించింది. అందుకే కాయలు చేదుగా మారిపోయాయి."


రాజు తన గర్వానికి సిగ్గుపడ్డాడు.రాజులకు సైతం వినయం ఉండాలి అని గ్రహించి, రాజధానికి వెనుదిరిగాడు.

# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

1



1. ఎ) ప్రాచీన భారతీయ సాహిత్యంలో మొట్టమొదటి నవల అని చెప్ప దగిన గ్రంథం ఏది?

బి) ప్రాచీన భారతీయ సాహిత్యంలో ఇద్దరు ఋషులు సంయుక్తంగా రచించిన గ్రంథంగా దేనిని చెబుతారు?

సి) మొట్టమొదటి చారిత్రక నాటకం అనే విశిష్టత ఏ గ్రంథానికి చెందుతుంది?

డి) కాళిదాసుకు తరవాత చెప్పుకో తగ్గ భారతీయ నాటక రచయిత ఎవరు? ఆయన రచించిన సుప్రసిద్ధ గ్రంథం ఏది?

2

అశ్వమేధయాగం తలపెట్టి, మహారాజైన అన్న వదిలిన యాగాశ్వం వెంట యువరాజు సైన్యంతో బయలుదేరాడు. మరే రాజూ అడ్డు పడకుండా అశ్వం వివిధ దేశాలు విజయవంతంగా తిరిగి వచ్చినట్టయితే ఆ రాజు చక్రవర్తి అవుతాడు!

అయితే, యాగాశ్వం వెంట వచ్చిన యువరాజునూ, సైన్యాన్నీ ఒక యువకుడు ఎదుర్కొన్నాడు. యుద్ధం జరిగింది. యువరాజు మరణించాడు. సంగతి తెలిసి ఒక స్త్రీ వచ్చి యువరాజును బతికించింది. ఆ యువకుడు మరెవరో కాదనీ, ఆ యువరాజు కుమారుడే ననీ గ్రహించింది.

యువరాజు ఎవరు? ఆ యువకుడి పేరేమిటి? ఆ స్త్రీ ఎవరు?



# సృజనాత్మక పోటీలు

సాధారణ ప్రచురణకు ఎంపికయిన మార్చినెల సామెత (మొక్కై వంగనిది మానై వంగునా) కథ

## దురలవాటు

లక్ష్మీపురంలోని రామయ్య, సీతమ్మ దంపతులకు ఒక కొడుకూ, కూతురూ పది పన్నెండేళ్ళ వాళ్ళు ఉండేవారు. పిల్లలిద్దరికీ కంచంలో అన్నం వదిలేసే దురలవాటు ఉండేది. "మీకు ఎంత కావాలో అంతే పెట్టించుకుని తినండి. అన్నం పరబ్రహ్మస్వరూపం. పారేయరాదు," అని రామయ్య చెప్పేవాడు.

అయితే సీతమ్మ "మనమేమన్నా కూటికి లేనివాళ్ళమా, అన్నం అంటే బంగారం అనుకోవడానికి?" అని పిల్లల్ని వెనకేసుకొచ్చేది.

రామయ్య మరేమీ మాట్లాడలేక పోయేవాడు. ఒకనాడాయన భార్యను పిలిచి, "రేపు పొద్దున్నే అన్నపూర్ణేశ్వరీ దేవి కొండకు వెళదాం. పరగడుపునే వెళ్ళాలి. ఏదైనా ఫలహారం చేసివ్వు, దర్శనం అయ్యాక అక్కడే తిని నిదానంగా రావచ్చు," అన్నాడు.

సీతమ్మ సంతోషంగా ఒప్పుకుని, మరునాడు పెందలాడే లేచి దద్దోజనమూ, పులిహోరా చేసి మూటకట్టి రామయ్య చేతికిచ్చింది. దానిని ఆయన సంచీలో పెట్టుకున్నాడు.

అందరూ బయలుదేరారు. ఉత్సాహంగా కొండ ఎక్కారు. జనం ఎక్కువగా వుండడంతో దర్శనం బాగా ఆలస్యమయింది.

అలసిపోయి నకనకలాడే కడుపులతో, వాళ్ళు గుడి వెలుపలికి వచ్చారు. కోనేరు కంటబడగానే, సీతమ్మ "ఆ సంచిలోంచి, ఫలహారం తియ్యి," అన్నది భర్తతో.

రామయ్య సంచిలో చేయిపెట్టగానే బిక్కమొహం పెట్టి, "ఎంత పొరబాటు జరిగిపోయింది. కొండ దిగువ పూజాసామగ్రి కొనేటప్పుడు ఫలహారంమూట తీసి పక్కనపెట్టాను. తిరిగి తీసుకోవడం మరిచిపోయాను," అన్నాడు.

సీతమ్మ రామయ్య మతిమరుపును తిట్టింది. ఇక చేసేది లేక కాళ్ళీడ్చుకుంటూ అంతా ఇల్లు చేరారు.

ఇంటికి రాగానే సీతమ్మ వంట చేయబోయింది. రామయ్య ఇప్పుడదేం వద్దు అంటూ, సంచీలోని ఫలహారం మూట తీశాడు. సీతమ్మ తెల్లబోయింది. మరుక్షణం కోపంకొద్దీ తిట్ల దండకం ఎత్తుకుంది. రామయ్య అదేం పట్టించుకోకుండా మూటలోని దద్దోజనమూ, పులిహోరా కంచాల్లో సర్ది పిల్లల ముందూ, భార్యముందూ పెట్టి తను ఒక కంచాన్ని అందుకున్నాడు. తింటూ, భర్తను తిడుతున్న భార్యను వారించి, "ఒకసారి పిల్లల కంచాలకేసి చూడు," అన్నాడు రామయ్య. శుభ్రంగా కడిగినట్టున్నాయి పిల్లల కంచాలు. కంచంలో గాని, చుట్టురాగాని ఒక్క మెతుకైనా లేదు.

"డబ్బు విలువ ఉన్నవాడి కన్నా లేనివాడికే ఎక్కువ తెలుస్తుంది. అన్నం విలువ మూడుపూటలా కడుపునిండా తినేవాడికన్నా కడుపుకాలే వాడికే ఎక్కువ తెలుస్తుంది. ఆ విషయం మీకు అనుభవ పూర్వకంగా తెలియజేయాలనే ఈ నాటకం ఆడాను. పిల్లలలో దురలవాటువుంటే పెద్దలు దానిని చిన్నతనంలోనే పోగొట్టాలి. మొక్కై వంగనిది మానైవంగుతుందా?" అన్నాడు రామయ్య.

సీతమ్మా, పిల్లలూ, ఆయన మాటల్లోని నిజాన్ని గ్రహించారు. అప్పటినుంచి పిల్లలు అన్నం వదిలేసే దురలవాటును మానుకున్నారు.

-ఆర్. శ్రీనివాస్





# భారతదేశం:

నాడు-నేడు

# శ్రీనగర్

## అందాల నగరం

జమ్మూ-కాశ్మీర్ రాష్ట్ర రాజధాని శ్రీనగర్, పేరులోనే కాదు; ప్రకృతి దృశ్యాల కారణంగానూ సుందర నగరం. సముద్రమట్టానికి 1,768మీ॥ ఎత్తులో వున్న ఈ అందాల నగరం- దాల్ తటాకం, మరెన్నో ఉద్యాన వనాలతో ఎటుచూసినా కన్నులపండుగ చేస్తుంది. అందమైన జీలం నది కూడా ఇక్కడే ప్రవహిస్తోంది

ఒకానొకప్పుడు ఈ ప్రదేశమంతా జలమయంగా ఉండేది. ఆ జలంనుంచి జలోద్భవుడనే రాక్షసుడు పుట్టాడు. నీళ్ళలో ఉన్నంత వరకు ఎవరూ ఏమీ చేయలేరన్న వరం కారణంగా వాడు అహంకరించి, చుట్టుపక్కల వారిని రకరకాలుగా వేధించ సాగాడు. వాడి రహస్యం ఎరిగిన కశ్యపుడనే ముని వాడి పీడను విరగడ చేయడానికి, దివ్యశక్తులుగల నాగలి సాయంతో అక్కడి జలాన్నంతా లేకుండా చేశాడు. నీళ్ళు ఎండి పోగానే రాక్షసుడు నిర్వీ ర్యుడైమరణించాడని పురాణాలు పేర్కొంటు న్నాయి.

కశ్యపుడి పేరు మీదుగా దానికి కశ్యప్-మీర్ అనే పేరువచ్చిందనీ, అదే కాలక్రమంలో కాశ్మీరు అయిందనీ చెబుతారు.

కాశ్మీరు రాజుల వంశవృక్షాన్ని తెలియజేసే కల్హణుడి 'రాజతరంగిణి' అనే ప్రాచీన చారిత్రక గ్రంథం శ్రీనగర్‌ను అశోక చక్రవర్తి నిర్మించాడని చెబుతుంది. నిజానికి ఈ నగరం నిర్మించిన కీర్తి ఆయన కుమార్తె చారుమతికే చెందాలి. ఎందుకంటే- ఆమె తన తండ్రితో ఆ సుందర ప్రదేశానికి వెళ్ళినప్పుడు దాల్‌సరోవరాన్ని చూసి ముగ్ధురాలై, "ధ్యానం చేసుకోవడానికి ఎంత ప్రశాంతమైన ప్రదేశం!" అన్నదట. ఆ మాట అశోకచక్రవర్తి అక్కడొక బౌద్ధవిహారం నిర్మించడానికి ప్రేరణ కలిగించింది. ఆ బౌద్ధవిహారం చుట్టూ అందమైన పట్టణం ఏర్పడింది.

దీనికి శ్రీనగర్ అని ఎవరు పేరు పెట్టారో తెలియదుగాని, సూర్యనగర్ అనేపేరు శ్రీనగర్‌గా రూపాంతరం చెందిందని కొందరు అభిప్రాయ పడుతున్నారు.

1947వసం॥లో భారత్ విభజన జరిగినప్పుడు జమ్మూ-కాశ్మీర్ మహారాజాకు ఆయన ఇష్టానుసారం ఇటు భారత దేశంలోగానీ, అటు పాకిస్తాన్‌లోగానీ చేరే అవకాశం ఇవ్వబడింది. అయితే, మహారాజా ఒక నిర్ణయానికి రాకముందే పాకిస్తాన్ ఓర్పును కోల్పోయి తమ సైనికుల సాయంతో కొందరు కొండజాతి వారిని కాశ్మీరుకు పంపింది. మహా రాజా తన సంస్థానాన్ని భారత దేశంలో విలీనం చేశాడు. వెంటనే భారత సేనలు ఆక్రమణ దారులను తిప్పికొట్టాయి. కాని ఐక్యరాజ్య సమితి కాల్పులను ఆపాలని ఆదేశించడంతో, లఢక్ జిల్లాలో కొంత ప్రాంతం పాకిస్తాన్ ఆక్రమణలోనే ఉండిపోయింది.

కాశ్మీరులో కల్లోల పరిస్థితిని సృష్టించడానికి పాకిస్తాన్ తన చర్యలను కొనసాగిస్తూన్న విషయం అందరికీ తెలిసినదే. పర్యాటకులను విపరీతంగా ఆకర్షించే శ్రీనగర్ కొన్ని సంవత్సరాలు కళాహీనంగా కనిపించేది. అయినా ప్రస్తుతం పరిస్థితులు మారుతున్నాయి. పాకిస్తాన్ ప్రోద్బలంతో సాగుతూన్న తీవ్రవాద కార్యకలాపాలు బలహీనమవుతూ క్రమంగా తగ్గుముఖం పడు తున్నాయి.

చాష్మాసాహీ అనే ఉద్యానవనాలతో నిండిన జలపాతం; నిషాల్ బాగ్ అనే ఆనంద ఉద్యానం; జహంగీరు నిర్మించిన షాలీమార్ బాగ్; ఆది శంకరులు, అరవిందులు ధ్యానంలో గడిపిన హరిపర్వత శిఖరం; మహమ్మదు ప్రవక్త శిరోజాలు భద్రపరచబడివున్న హజ్రత్‌బాల్ మసీదు మొదలైనవి ప్రాచీన శ్రీనగర్‌లో ప్రసిద్ధమైనవి. ఇక ఆధునిక శ్రీనగర్- హోటళ్ళతో, పడవ గృహలతో, ఇతర సదుపాయాలతో పర్యాటకులకు స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉంటోంది. ప్రధానంగా ఇదొక పర్యాటక కేంద్రం.

శ్రీనగర్‌లో ప్రశాంత ప్రకృతి వాతావరణం మధ్య విద్యాసంస్థలు ఉన్నాయి. మామూలు పాఠశాలలు, కళాశాలలతో పాటు జమ్మూ-కాశ్మీరు విశ్వవిద్యాలయం, 'షేర్- ఇ- కాశ్మీర్ యూనివర్సిటీ ఆఫ్ అగ్రికల్చరల్ సైన్స్ అండ్ టెక్నాలజీ' మొదలైన సుప్రసిద్ధ విద్యాలయాలు ఉన్నాయి.



తేలుతూన్న ఉద్యానం-పాతచిత్రం. ఎదుటిపేజీలో: దాల్ లేక్ పడవగృహాలు.

అద్భుతమైన ప్రకృతి దృశ్యాలకు నిలయమైన శ్రీనగర్ లాంటి ప్రాంతాలకే కాక హస్త కళలకూ ముఖ్యంగా మెత్తటి కలపతో తయారు చేసే నగిషీ పనులు నిండిన అందమైన వస్తువులకూ, శాలువలకూ, తివాసీలకూ, కస్తూరికీ కాశ్మీరు ఎంతో ప్రసిద్ధిగాంచింది.

అందాల నగరమైన శ్రీనగర్ దేశ విదేశాల పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నది!

# గుణపాఠం నేర్పుతూన్న అవినీతి!

ప్రాచీన ఏథెన్స్ నగరంలో అత్యుత్సాహంతో ఒలింపిక్ క్రీడలు ఆడేవారు. చాలాకాలం విరామం తరవాత 1896వ సం॥ ఏప్రిల్ 6వ తేదీ ఒలింపిక్ క్రీడోత్సవాలు మళ్ళీ ప్రారంభించారు.

ప్రాచీన ఒలింపిక్ క్రీడలలో విజేత తలమీద ఆలివ్ పత్రాల కిరీటం పెట్టి సత్కరించేవారు. అది క్రీడాకారుడి గొప్పతనానికి సంకేతం. క్రీడాకారుడి శక్తి సామర్థ్యాలనూ, నైపుణ్యాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పటికీ, వాటితో పాటు అతని సత్ప్రవర్తన, నిజాయితీలను కూడా



## వార్తలు విశేషాలు

ప్రధానంగా భావించేవారు.

ఒలింపిక్ క్రీడలనయితే పునః ప్రారంభించారు గాని, ఆనాటి క్రీడాస్ఫూర్తిని మళ్ళీ తీసుకు రాలేకపోయారు. కాలక్రమంలో చాలా మందికి క్రీడలలో పాల్గొనడం ధనార్జనకు ఆకర్షణీయమైన మార్గంగా తయారయింది. ఒకప్పుడు క్రీడాకారులకంటూ గౌరవం, ధైర్యం, నిజాయితీ ఉండేవి. క్రమంగాక్రీడాకారుడు తన దేశ ప్రజల సమిష్టిఅహంకారానికి సంకేతంగా మారిపోయిన కాలం వచ్చి కూర్చుంది. క్రీడలలో గెలుపొందే క్రీడాకారుల మీదే తమ దేశ గౌరవ మర్యాదలు, గొప్పదనం ఆధారపడి వున్నట్టు ఆయాదేశ ప్రజలు ప్రవర్తిస్తున్నారు. క్రీడాస్ఫూర్తిని పక్కన పెట్టి క్రీడాకారులు డబ్బు కోసం లేదా సమిష్టి అహంకారం కోసం ఆటలాడటం ప్రారంభించారు.

ఆదర్శాలనూ, నిజమైన స్ఫూర్తినీ వదులుకున్నట్టయితే ఎవరైనా సరే అవినీతికి లోను కావడం సహజం. ఎలాగైనా విజయం సాధించి తీరాలని కొందరు మాదకద్రవ్యాలు పుచ్చుకోవడం వంటి అడ్డదారులు తొక్కసాగారు. ఈనాడు ఆ దారుణ సత్యం మరింత వికృతంగా మన కళ్ళముందు విలయతాండవం చేస్తోంది. భారత క్రికెట్ జట్టుతో పోటీపడిన దక్షిణాఫ్రికా క్రికెట్ జట్టు నాయకుడికి- భారత్ జట్టు చేతిలో ఓడిపోయేలా చేయడానికి లంచం ఇచ్చారన్న ఆరోపణలు వచ్చాయి. దాని ద్వారా భారత్ జట్టు గెలుపొందుతుందని పందెం కాసిన వారికి పెద్ద మొత్తాలు ముట్టు తాయట. ఈ విషయంగా విచారణ జరుగు తున్నది. అయితే, ఇది కొత్తేమీకాదనీ, చాలాకాలంగా సాగుతూన్న తతంగమేనని క్రీడారంగంతో సంబంధం వున్న పలువురు అభిప్రాయపడుతున్నారు.

ఇది చాలా సిగ్గుచేటు వ్యవహారం. ఈ సంఘటన నుంచి గుణపాఠం నేర్చుకుని పరిస్థితులను చక్కదిద్దుకోలేదంటే భవిష్యత్తులో మరిన్ని అవమానాలపాలు కావలసి వస్తుంది. క్రీడల పట్ల మనం చూపుతూన్న మితిమించిన ఆసక్తికి



కాస్తా కళ్ళెం వేయాలి. క్రీడలకు ఇవ్వవలసిన ఉచితస్థానం ఇవ్వాలే తప్ప, వాటి మీదే మన భవితవ్యం ఆధారపడి వున్నట్టు భావించ కూడదు.

ప్రతిదేశం శిక్షణ ఇచ్చేప్పుడే, క్రీడాకారులలో క్రీడాస్ఫూర్తిని పెంపొందించాలి. నైతిక ప్రవర్తనకు ప్రాముఖ్యతనివ్వాలి. సరైన అవగాహన సూహృద్భావం ఉన్నప్పుడు జీవితంలో ప్రతి ఒక్కటీ క్రీడగానే కనిపిస్తుంది.

క్రీడల ఫలితాలపై ''బెట్టింగ్''ను చట్టపరంగా నిషేధించాలి. అలా పందెంకాసేవారిని కఠినంగా శిక్షించాలి. క్రీడలు సైతం వ్యాపారమై పోవడం అనుమతించకూడదు.

''ది స్పోర్టింగ్ స్పిరిట్ '' అనే వ్యాసంలో సుప్రసిద్ధ రచయిత జార్జ్ ఆర్వెల్ ఇలాఅన్నాడు: ''గెలిచితీరాలన్న క్రీడలలో న్యాయమైన ఆటకు ఆస్కారం లేదు. ద్వేషం, అసూయ, అహం భావం, నిబంధనల పట్లతిరస్కారభావం, హింస నుతిలకించడంలో ఒక విధమైన పైశాచిక ఆనందం తప్పవు. మరోమాటలో చెప్పాలంటే- అది కాల్పులు లేని యుద్ధం! ''

ఆ పరిస్థితిని మార్చాలని ఆయన దానిని గురించి లోతుగా ఆలోచించి మనకు తెలియ జేశాడు. దానిని మనం మార్చలేదంటే క్రీడలు కేవలం హాస్య ప్రహసనాలుగానే మిగిలి పోతాయి.

# ఫోటో
## వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ,
వడపళని
చెన్నయ్-600026





వ్యాఖ్యలను పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఆగస్ట్2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

## అభినందనలు



ఏప్రిల్2000 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
ఎస్.కె. సబిహా
దర్గామిట్ట, నెల్లూరు - 524004



మొదటి ఫోటో : అల్లారు ముద్దుల చిన్నది !
రెండవ ఫోటో: అంబరాన ఊగుతున్నది !